ప్రకాశకులు
ఆంధ్ర భూదాన యజ్ఞ సమితి
సంచాలక్, సాధు సుబ్రహ్మణ్యం
గాంధీనగరం :: విజయవాడ.

ద్వితీయ ముద్రణ
ప్రతులు 5000
జూన్ 1955

వెల నాలుగు అణాలు

ముద్రాపకులు
ఎర్నేని బాలగంగాధర తిలక్
సర్వోదయ ముద్రణాలయం
శ్రీ గాంధీ ఆశ్రమం,
శేరీ కల్వపూడి (పోష్టు) కృష్ణా.

# తొలిపలుకు

భూదానోద్యమ మారంభమై యిప్పటికి 5వ యేడు నడచుచున్నది. ఉద్యమ గమనం హెచ్చుతున్నకొలది ప్రజలలో ఉద్యమ మూలతత్వమును గురించి తెలుసుకొనవలెనన్న జిజ్ఞాస అధికమవుచున్నది. ఉత్తరప్రదేశ భూదాన యజ్ఞ సమితి యీ ఆవశ్యకతను దాదాపు మూడేండ్లకితమే గుర్తించి హిందీలో భూదానయజ్ఞ ప్రశ్నోత్తరి, అను చిన్న గ్రంథమును వెలువరించినది. దాని తెలుగు అనువాదమే యీ గ్రంథము.

భూదాన పదయాత్రలో శ్రీ ఆచార్య వినోబాజీని పలువురుపలువిధాలుగా యీఉద్యమాన్నిగురించి ప్రశ్నించటం జరిగింది. ఆ ప్రశ్నలు వాటికి శ్రీ వినోబాజీ యిచ్చియున్న సమాధానములు యిందు సంపుటీకరించబడినది.

ఉద్యమ మూలతత్వం, వ్యాపక స్వభావం, లక్ష్యం తెలుసుకొన గోరినవారికీ ప్రశ్నోత్తరి లెస్సగా ఉపయోగపడగలదు.

ప్రకాశకులు

# భూ-సమస్య-బాపూజీ



మీరాబెన్:- స్వరాజ్యము వచ్చినపిమ్మట భూసమస్య ఏవిధముగ పరిష్కరింపబడును?

బాపూజీ:- భూమిఅంతా ప్రభుత్వానిదే. ఈఆదర్శము నంగీకరించువారికే రాజ్యాధికారము హస్తగతమగును. చాలా మంది జమీందారులు - భూస్వాములు సంతోషముతో తమ భూములను వదలుకొందురు. అటుల వదలనివారిచే ఆ పని చట్టమే చేయించును. ఇది నా అభిప్రాయము.

మీరా:- ఈసంస్కరణకు ప్రజలను ముందు సుముఖులుగా చేయవలదా?

బాపూ:- ప్రజలకట్టి శిక్షణ యిదివరకే లభించినది. దాదాపు ప్రజలందరు నేడు అందుకు సిద్ధముగనే యున్నారు.



"ప్రపంచములోని నీరంతా సముద్రమునైపు పరుగెత్తుతుంది. కొండలమీదనీరు, పల్లపునీరుకూడ సముద్రములోకే ప్రవహించుతుంది. పల్లపునీటితో నీవు సముద్రములోనికి వెళుతున్నావెందుకు. పల్లములోనే యున్నావుగదా అని అడిగితే నేను సముద్రముకంటె ఎత్తుగానున్నానని అది జవాబుచెపుతుంది. అలాగే పేదవానికి కొంతలోకొంత భూమియివ్వటం భాగ్యవంతుని కర్తవ్యము. అట్లే బక్కరైతుకూడా భూమిలేనివానికి తనకుతోచినంత యివ్వాలి."

— వినోబా

## [illegible] ప్రశ్నోత్తరాలు

ప్రశ్న:- చట్టసహాయం లేకుండా భూసమస్యా పరిష్కారం సాధ్యమా?

జవాబు:- రష్యా చైనాలనుజూచి మీరు పాఠం నేర్చుకోండి. తెలంగాణాలో హింస, చట్టం రెండూ పనికిరాలేదు. అహింసా క్రాంతి సమైక్యతను నిరూపించింది. చట్టాన్ని ప్రవేశపెట్టేవారికన్న దానిని నిర్మూలింపజూచే వారికే అందలిలోపాలు బాగా తెలియును. చట్టం చేయడం మంచిదే. చేయాలి. అందుకు అనుకూలమైన వాతావరణం భూదానంద్వారా లభిస్తుంది.

నాకు చట్టమంటే అయిష్టత లేదు. కాని మొదట ఓటింగు జరిగి తరువాత చట్టంవస్తుంది. ఓటింగు అనుకూలంగా ఉండబట్టేగదా అస్పృశ్యతా నివారణ చట్టం కావటం జరిగింది? కాని చట్టంవల్లనే అన్ని పనులు జరుగుతున్నాయని మాత్రం నేను చెప్పను. జాతిభేదం చట్టాలవల్ల నిర్మూలమవుతుందా? చట్టముండే వర్ణాంతర వివాహాలుజరుగుతున్నవా?

చట్టం జనామోదాన్ని పొందినదిగా ఉండాలని నాకోరిక. చట్టంపెట్టి బలవంతంగా పని చేయించలేము. ప్రజాభిప్రాయ వ్యతిరేకమైన చట్టం అమలుగాదు. చట్టం ప్రవేశపెట్టడంలోగల ఉద్దేశం ప్రజలు దానిని సంతోషంగా స్వీకరించి శాంతి సుస్థిరతల సాధించుకోవాలని, చట్టనిర్మాణంగాని, నిర్మూలన

గాని ప్రజల చేతులలో పని. ప్రభుత్వం ఒక చట్టంచేస్తే ప్రజలు ఆ చట్టాన్ని అంగీకరించకపోతే యిక దానికి విలువే ముంటుంది? పదునాల్గు సంవత్సరాలలోపు వయస్సు పిల్లలకు వివాహం చేయరాదని ప్రభుత్వం శాసనం జేసింది. కాని మనం 20 యేండ్ల వయస్సులో పిల్లలకు వివాహం చేయుచున్నాము. అంటే శాసనం ప్రజా సంస్కారానికి చాలతక్కువ స్థాయిలోనే ఉందన్నమాట. ప్రభుత్వం శాసనంద్వారా ప్రజాసేవ జేయవలసి యున్నది. ప్రభుత్వ చట్టానికి దేశం నలుమూలలనుండి అనుకూలత రావాలి. ఇదే చట్టనిర్మాణమందు గర్భితమై యున్న అర్థం. కాని చట్టంద్వారా విప్లవం తేలేము. బుద్ధుని సమయంలో ఏమి జరిగిందో మీకు తెలుసు గదా? అతడు రాజుగాఉండి విప్లవాన్ని తేగలిగినట్లయితే రాజ్యాన్ని వదలుకోవటం యెందుకు జరుగుతుంది? విప్లవకార్యం శాసనం వల్ల సఫలీకృతం కాదనే నా ఉద్దేశ్యం.

అనుకూల వాతావరణం యేర్పడినమీదట చట్టం చెయ్యటానికి నేను అంగీకరిస్తాను. నేను అహింసా మార్గావలంబిని. అహింసా పద్ధతిలో శాసనం ఉండరాదనేదేమీ లేదు. ఓటింగులో ముందు అనుకూల వాతావరణాన్ని సృజించుకోవలసి యుంటుంది. ఓటింగులో మెజార్టీ ఆమోదం లభించి యేకొద్దిమందో వ్యతిరేకించటం జరిగితే అప్పుడు శాసనం సహాయపడుతుంది. ఇది నా పద్ధతి. సామ్యవాదులు కూడ శాసనం కావాలంటారు. కాని వారి చట్టనిర్మాణం హింసతోనే ప్రారంభమవుతుంది. చట్టం అమలులోకి వచ్చిన

తర్వాతకూడా అందు హింసే గర్భితమై యుంటుంది. నా లక్ష్యం కూడ శాసనమే. కాని నా ప్రయత్నం కరుణతో ప్రారంభమవుతుంది. ప్రజలకు శాంతియుతంగా అన్ని విషయాలూ తెలియజేయ బడగలవు. మనము ప్రవేశపెట్టబోయే శాసన లక్ష్యం న్యాయమైనదని అందు తమ రక్షణ యిమిడి యున్నదని ప్రస్తుతం అమలులోనున్న విధానం అన్యాయమైనదని ప్రజలు గుర్తించగలుగుతారు. నా పని అంతటితో పూర్తి యవుతుంది. ఈవిధంగా నా ప్రయత్నం కరుణతో ప్రారంభమై అహింసా పద్ధతిని తగు వాతావరణ సృష్టిగావించుకొని శాసన రూపాన్ని పొందుతుంది.

బీదలకు పొలమునిచ్చుటలో మేలున్నదనే వాతావరణం ప్రజలలో ఏర్పడినప్పుడు శాసన నిర్మాణం జరుగుతుంది. నేను శాసననిర్మాణం చేయిస్తాను. కాని దానికోసం నేను యెదురు చూడను. యాభయ్యైసి ఎకరాలు లభ్యంకావటానికి 75 యేండ్లు పట్టిన వ్యర్థంచేయ నవసరంలేదు. వాతావరణం మారినప్పుడు చట్టం తయారవుతుంది. అది రాబోతుందికూడా. ప్రజలు శాసనమును ప్రేమతో అంగీకరించునట్లు నేను వాతావరణమును సమకూర్చితిని. నిజానికి యిది శాసనం కాకుండా ఒక ప్రేమ చిహ్నంగా నిలిచిపోతుంది. శాసనమున్నప్పుడు శిక్షావిధానంకూడ ఉంటుంది. తమ కష్టైదుటఉన్న శాసనమునకు లోబడియుండేదాన్ని యెంతవరకు అతిక్రమించగలరో అంతవరకు అతిక్రమించుతుండటం కూడ జరుగుతుంది. గవర్నమెంటు కంటోళ్ళు బెడితే వ్యాపారస్తులు వాటిద్వారా విపరీత లాభాలు గుంజటానికి ప్రయత్నిస్తారు. ఆ శాసనం నిరుప

యోగమై పోతుంది. వ్యాపారస్తులు ధనికులు తమ తెలివి తేటలతో ప్రభుత్వాన్ని మోసగింప జూస్తారు. ప్రభుత్వం వారిని మోసగింప జూస్తుంది. ఈ పోటీలో ఉభయుల తెలివి తేటలు వ్యర్థమై ఉభయులకు హాని జరుగుతుంది. ప్రభుత్వం మనకు మేలుచేయుటకు ఆలోచిస్తున్నదనే విశ్వాసాన్ని శాసనం ద్వారా బీదవారికి కలిగించవచ్చు. కాని కేవలం శాసనం వలన మనము సంతుష్టి పొందజాలము. శాసనము లేకుండానే అందుకు అనుకూల వాతావరణమును కల్పించగల యీభూమి దానమును అందరూ సర్వత్రా వ్యాపింపజేస్తే అనేక సత్ఫలి తము లుండును.

ప్రశ్న :- తమభూదానయజ్ఞ మెప్పటికి పూర్తి కాగలదు ?

జవాబు:-పూర్తి అనేదాన్ని మనం రెండువిధాలుగా పేర్కొనవచ్చు. అవి (1) మనము పెట్టుకున్న లక్ష్యానికి మనం యెంతదాపులోకి వచ్చాం. (2) సఫలత అంటే మనం మనదృష్టిలో యేమనుకొంటున్నాము. ఇప్పటికి నా యోగ్యతకు మించిన ప్రయోజనమేయిందు కనబడుచున్నది. ముందు కూడ లభింపనున్నట్లే తోచుచున్నది. సంవత్సరానికి ఒక లక్ష ఎకరాలు సేకరింపగలనని మొట్టమొదట నాఅంచనా. ఆ అంచనా నిజమైనది. ఇప్పుడు ఒక పెద్దపని యెదుట కనుపిస్తున్నది. సేవాపురి కార్యకర్తల సమావేశం వచ్చే రెండేడ్లలో 25లక్షల ఎకరాల భూమి ప్రోగుచేయాలని సంకల్పించింది. ప్రజలలో భూదానంపట్ల ఉత్సాహం పెరుగుతున్నట్లు కనిపిస్తున్నది. ఎక్కడికి వెళ్ళినా మేముచూచుచున్నది దే. ప్రజలు ఎన్నికలలోమునిగియున్నప్పటికి మాపని బాగానేసాగిపోయింది. ఇప్పుడో! ప్రజల సానుభూతితో

పాటు నాకోర్కెకూడ పెరిగింది. ఇప్పుడిది నా దృష్టిలో "సామాజిక విప్లవ సాధనకొరక నూతన ప్రయోగము." మొట్టమొదట ప్రజలు నన్ను మీ పని పూర్తిగావటానికి యెంతకాలం పడుతుందని అడుగుతుండేవారు. అందుకు నేను "5 శతాబ్దాలు" అంటుండేవాణ్ని. మొదటి సంవత్సరం అంచనా ప్రకారం లక్ష్యం చేరుకోటానికి 500 యేండ్లు పడుతుంది. మేము విరామం లేకుండా పనిచేస్తున్నాము. కాని మనం అంత కాలం బ్రతుకగలమాఅనే సందేహంమాత్రం కలుగలేదు. ఇప్పుడుకూడా యెవరైనా మమ్మల్ని అదేప్రశ్న వేస్తే మళ్ళీ అదేసమాధానం చెబుతాము. ఏలనన పనికూడ 10 రెట్లు పెరిగింది. గనుక మనము సదుద్దేశముతో సదాలోచనతో ప్రచారంచేస్తూ పోతే 3వ యేడుకూడ నిరభ్యంతరంగా పదిరెట్లు పని పెరుగుతుందని మా విశ్వాసం.

మీరు నిరాశ పడవద్దు. ప్రపంచంలో బలిష్టమైన వ్యతిరేకత మనవంక దృష్టినిగుడ్చిచూస్తున్నదని ఆలోచించవద్దు. అదిచివికి, జీర్ణించి, శిథిలమై, జీవరహితమై పోగలదనిమాత్రం తెలుసుకోండి. అట్టి దురాలోచనపరులు బజారులో మనపై వారెంతపెద్ద ప్రచారం చేసినప్పటికి. ఆ ప్రచారమెంత యెక్కువయినప్పటికీ అది నిర్జీవమే. అట్టిది తప్పని లోకము గుర్తించుటకు ఒక్క క్షణంపట్టదు. ఒక్క క్షణకాలం నష్టపోవటం మనకంత కష్టంకాదు.

దేశం మొత్తంమీద ఒక్క రెండు సంవత్సరాలలోపల 12 లక్షల ఎకరాలు లభించింది. ప్రపంచ చరిత్రలో యిది

కనివిని యెరుగని సంఘటన. ప్రేమతో నచ్చజెప్పినమీాదట తమకున్న భూమిలో కొంత భాగమును పేదలకు వారిని తమ ఆత్మీయులుగా భావించి యివ్వటం చాల కొత్త విషయం. ప్రజలీ విషయాన్ని గ్రహిస్తే యిది ఆశ్చర్యకరమైన ఘట్టమే.

వర్షము కురవనన్నాళ్లు కురవదు. కురవ నారంభిస్తే ఒక గ్రామం తరువాత మరొక గ్రామంలో గాకుండా దేశమంతటా కురుస్తుంది. అది ఒక్కొక్క గ్రామంలో వరుసనే కురుస్తూపోతే మొత్తం దేశమంతటా కురియటానికి కొన్నేండ్లు పడుతుంది. భూదానోద్యమము జనసమూహాము నెక్కువగా ప్రభావితుల జేసింది. అనగా చూస్తుండగానే భారం తేలిక పడుతున్న దన్నమాట.

సామాజిక విప్లవము.

ప్ర:-భూదానయజ్ఞము సామాజిక విప్లవ రూపములో నొక కొత్త ప్రయోగము. దీనికి తమ రేమందురు?

జ:- ముందు తయారుకానున్న వస్తురూపమును నేనిప్పుడే చూడగలుచున్నాను. చూచేవారికి అది సాక్షాత్కరిస్తుంది. కాని గ్రుడ్డివానికి తల బ్రద్దలైన తరువాతగాని స్తంభము కనుపించదు.

ప్రజలు భూదానోద్యమాన్ని గురించి చాల శ్రద్ధతో తెలుసుకుంటున్నారు. ప్రజా శాసనము తయారయినప్పుడు అనగా భూమిగలవారుకూడ భూదానోద్యమానికి అనుకూలురైనప్పుడుశాసనము విప్లవము రెండూఏకీభవించగలవు.అప్పుడు ఏ విద్యావంతుడుగాని దీనిని వ్యతిరేకించడు. ఈనాడు రాయి

ష్టులు, లెఫ్టిష్టులు మొదలైన వారంతా నా కనుకూలురే. కేవలం భూమి పంపక విషయంలోనే వారికి అనుమానము లున్నవి. హైదరాబాదులో పంపకాలు జరుగుతున్నవి. కాని అక్కడినుండి యెట్టి ఫిర్యాదును రాలేదు. ఆలోచనా దృష్టికి, సాహిత్య దృష్టికి, సత్యదృష్టికీయెక్కువ భేదము లేదు. ఏలనన మొదట మనస్సులోభావంజనిస్తుంది. తరువాత మాటల ద్వారా వెలువడుతుంది. అనంతరం 'కృతి' రూపం ధరిస్తుంది. పొలము కూడ అంతే. అది యజమానిని అంటిపెట్టుకునే ఉండునట్లైదైతే ప్రజలు దానిని వదలుకోవడానికి యెందుకు సిద్ధ పడుతున్నారో తెలుసుకోండి. నేటి పరిస్థితుల ప్రభావం అది పొలము కలవాడిదగ్గర ఉండటానికి యిష్టపడటంలేదు. అది తన నిజమైన యజమాని దగ్గరకు చేరుకోవాలని కుతూహల పడుతు న్నది. అది తనంత తానుగా భూమిలేనివారికి స్వాధీనం కావా లని కోరుకొంటున్నది. లేకపోతే తెలంగాణాలో ఆ ప్రజల భాషకూడా తెలియని నాకు భూమి యెలా లభించేది? కాని యేదైతే నన్ను దానమడగటానికి ప్రేరేపించిందో అదేదాన్ని మరొకరికి యివ్వాలనికూడ ప్రేరేపించింది. ఇప్పటికి వాతా వరణాన్ని బట్టి యీ ఉద్యమంలో యెంతో ఉత్సాహం వెల్లివిరు స్తున్నది. అందుచేతనే భూస్వామివద్ద ఉండుటకు భూమే స్వయ ముగా అయిష్టత జూపుచున్నదని నేను చెప్పుచున్నాను. ఎవరు కాయకష్ట మొనర్పగలరో వారిదగ్గరే అది ఉండాలని కోరు తున్నది.

—

## ఈ సమస్యా పరిష్కారం యెప్పటికి?

ప్రశ్న॥ఎంతకాలములో భూమిలేనివారికిభూమిలభిస్తుంది? వారి దుఃఖానికి అంతమెప్పుడని మీరు భావిస్తున్నారు?

జ॥బుద్ధభగవానుడు దుఃఖాలనుదూరంచేయుటానికిప్రయత్నించాడు. కాని అందుకుబదులు దుఃఖమే స్థిరముగా నిలవటం జరిగింది. నేము యే సమస్యను పరిష్కరించుటకు రాలేదు. ఈలోపున మా సమస్యయే పరిష్కారము కావచ్చును. వినోబాగారి సమస్య పరిష్కారమైనదని పత్రికలకు వ్రాసే సమయమే కావచ్చు. కనుక యిదంతా మన పురుషార్థముమీద ఆధారపడి యుంటుంది. దానమడుగువారు ప్రతిష్ఠాపరులు గావలెను.పొంగులువారుతున్న నదిపైనున్న వంతెనయిరువైపుల వారికి ఉపయోగకారియైనట్లు దానగ్రాహికూడ భూమిదానం చేసేవారికి భూమిని పొందేవారికి ఉభయులకు విశ్వాసపాత్రుడు కావలెను. ఈ వ్యక్తి ఉభయుల శ్రేయస్సు కోరువాడని నమ్మకము కుదిరినప్పుడు వారు యిస్తారు. ఇంకా ఎక్కువగా యిస్తారు.నేడు దానంపుచ్చుకొనే వాతావరణాన్ని మార్చియిచ్చే వాతావరణం సృష్టించుట మన ప్రథమకర్తవ్యం. ఇది అత్యంత విప్లవకరమైన విషయం.

## హింసా? లేక అహింసా?

ప్రశ్న॥భూసమస్యవంటి గొప్పసమస్యలు యుద్ధాలు,అశాంతి లేకుండా పరిష్కరింపబడునా?

బుద్ధుడు, క్రీస్తు, రామానుజుడు మొదలైన మహాపురుషులు యుద్ధములవలన కానిపనులు చేసియున్నారు. ఈపనివారి వారి పద్ధతుల ననుసరించి జరుగుతుంటుంది.

ప్ర॥ భూదాన యజ్ఞమువలన భూమి చిన్నచిన్న ఖండములైపోగలదు. ఆర్థికదృష్టితో చూస్తే దీనివలన కీడు కలుగుతుంది. ఇందుకు మీరేమంటారు?

జ॥ ఐదుకోట్ల ఎకరాలభూమి హస్తగతమై గొప్పవిప్లవం వర్ధిల్లటం జరిగినప్పుడు యీ "ఫ్రాగ్మెంటేషన్" అనే ప్రశ్న చాల స్వల్పమైనది. నిజానికి యీ ప్రశ్నే అనవసరము. నేడు చైనాలో కమ్యూనిస్టులు అధికారంలో వున్నారు. అక్కడ "ఫ్రాగ్మెంటేషన్" సిద్ధాంతముద్వారానే పని చేస్తున్నారు. రైతులకు చిన్నచిన్న ముక్కలు యిస్తున్నారు. ఈ చిన్నచిన్న ముక్కలుగల రైతులమధ్య యెన్నో విషయాలమీద పరస్పర సహకారం జరిగి పోతున్నది. ఎలాగంటే నాల్గు లేక అయిదు కుటుంబాలు కలసి ఒక యెడ్లజతను వుంచుకోవచ్చును. ప్రతి రైతూ వేరువేరుగా కాపలా కాయనవసరంలేకుండగా ఆ పని కూడ సమిష్టిగానే జరుపుకోవచ్చును. దీనికితోడు గ్రామ పరిశ్రమల పథకం వుండనేవున్నది. ఇందుకుకూడ అట్టి సహాయ సంపత్తి లభింపగలదు.

నేను యిక్కడఅనేక జిల్లాలు గ్రామగ్రామం తిరిగాను. నేను రైతులను ప్రశ్నింపంగా వారు 5 బీగాలు పొలముంటే

మాకుటుంబ జీవితం గడచిపోతుందని చెప్పారు. ఇంత తక్కువ భూమి యిక్కడ (మధ్యప్రదేశ్) ఉంది.

మధ్యప్రదేశ్‌లో ఒక యెడ్లజత 20 యెకరాల వరకు దున్నగలుగుతుంది. 20 ఎకరాలు ఒక కుటుంబ పోషణకు సరి పోతుందని ఒక గ్రామపెద్ద నాతో అన్నాడు. కాని మీా ఉత్తర్ ప్రదేశ ప్రభుత్వమే 6 1/4 ఎకరాలె కుటుంబపోషణకు చాలునని అంగీకరించింది. ఐదుకు బదులు 6 1/4 ఎకరం యివ్వటానికి నాకెట్టి అభ్యంతరమూ లేదు. "భూమి తెచ్చి యిచ్చేది మీారే కనుక మీారు యెక్కువ భూమి తెస్తే నేనూ యెక్కువ పంచియిస్తాను. భూమి చాలటం చాలకపోవటం ప్రభుత్వదృష్టిపై ఆధారపడి ఉండదు. గ్రామీణ దృష్టిపైఆధార పడి యుంటుంది. కుటుంబపోషణకు కావలసిన భూవసతి పరి మాణం దృష్టిలోపెట్టుకొని దేశంవిషయం మరచి పోవటం మాత్రం జరగదు. ఇక్కడ భూమి తక్కువ. కనుక తక్కువ భూమిలోనే యెక్కువ వుత్పత్తికి మార్గం చూడాలిగాని కుటుం బానికి యెంత భూమి అవసరమనే విషయం ముఖ్యంగాదు. చైనా జపానులలో పొలాలు యెంత చిన్న చిన్నవిగానేఉన్నవి? ఎడ్లజత ఉన్న రైతుకు 15 ఎకరాలన్నా వుండాలని మనం అను కుంటున్నాము. అలాగే ట్రాక్టరువుంటే 400 ఎకరాలు వుండ వలసి వస్తుందిగదా! ఈ విధంగాజూస్తే ఎడ్లు లేకుండా వ్యవసా యం చేసుకునే రైతుకు ఒక యూనిట్ (భూమి ప్రమాణం), ఎడ్లజత వున్నరైతుకు రెండు యూనిట్లు, ట్రాక్టరు రైతుకు మూడు యూనిట్లు, భూమి వుండవలసివస్తుంది. నేను

యీ మూడుపద్ధతులు పనికిరావని చెప్పుతున్నాను. ఒక్కొక్క కుటుంబానికి ఉండవలసిన కనీస భూపరిమాణం నిర్ణయించి అందు సహకారాన్ని అవసరమైనంతవరకు సంఘటితపరచు కొనుట ఉత్తమమని నా వుద్దేశ్యం. సంపూర్ణసహకారమును గురించి అనేకమంది మాట్లాడుతుంటారు. కాని ప్రస్తుతపరిస్థితులలో అది అంత తొందరగా ఆచరణ సాధ్యమయ్యేది కాదు. నాలుగైదు కుటుంబాలు కలిసి సమిష్టిగా ఒక యెడ్లజతను పెట్టుకోవటం, తడుపు, కాపుదారీ వ్యవహారాలు వుమ్మడిగా జరుపుకోవటం రైతుకు సాధ్యమవుతుంది. అట్టి సహకారం నేడు పల్లెలలో వుండనేవున్నది. పొలంలేని ప్రతివారికి పొలం పంచటమనేది మా కార్యక్రమం కాదు. బ్రతుకు దెరువుకు వేరు మార్గంలేక వ్యవసాయ క్షేత్రంలో రెక్కలకష్టం జేసుకొని జీవిస్తున్నవారికే మేము భూమి యిస్తున్నాము. చిన్నచిన్న పొలాలలోకంటే పెద్దపెద్ద భూఖండాలలో పంటయెక్కువ పండుతుందనే వాదం ఒకటున్నది. ఈవిషయమై పరంధామ్ఆశ్రమంలో ప్రయోగంజేసి చూడగా యీ వాదం నిరర్థకమని రుజువయింది.

ప్ర॥ సహకార వ్యవసాయమును గురించి మీయభిప్రాయమేమి? ఈ విషయమై మీరు ప్రణాళికా సంఘంతో ఏకీభవించుచున్నారా?

జ॥ ఈ ప్రశ్న ప్రతిపట్టణంలోను నన్నెదుర్కొనుచునే యున్నవి. సమాధానమిచ్చుచునే యున్నాను. ఇది గాలిలో ఆలోచించి చెప్పే విషయంగాదు. సహేతుకమైన ఆచరణ

దృష్టితో దీనిని నేను పరిశీలిస్తున్నాను. వాగాడంబరములలోనికి దిగకుండ వర్తమానస్థితిలో కొంత కృషిసాగించిననేగాని మనం గ్రామీణులకు దారి జూపించలేము. మన దేశంలో కనీసం 10 వేల సంవత్సరాలనుండైనా వ్యవసాయం జరుగుతున్నదని, మనది వ్యవసాయ ప్రధాన దేశమని గుర్తింపాలి. ఇది యీ దేశీయులకు స్వాభావసిద్ధమైన వృత్తి.

ఈ యధార్ధమును దృష్టినిడుకొని యిప్పటికి యీ చిన్న చిన్న భూ ఖండములను యధాతధముగానే ఉంచి నీటి వసరులను అధికంజేసి అధికోత్పత్తికి రైతు తన కుటుంబశక్తి నంతను వినియోగించునట్లు జేయుటే ప్రస్తుత పరిస్థితిలో ఉత్తమ మని నేను భావించుచున్నాను.

భూఖండములకు ప్రత్యేక ప్రాముఖ్యం లేకపోలేదు. నేను కనీస భూఖండం 5 ఎకరాలుండవలెనని భావిస్తున్నారు. ఇది కొంచెము తక్కువే గావచ్చు. ఉత్తర ప్రదేశ ప్రభుత్వం యీ ప్రమాణం 6 1/4 ఎకరాలు వుండవలె నంటున్నది. ఈ రెంటికి పెద్ద తేడా లేదు. నేను గ్రామాలలో సంచారం జేస్తున్నాను. ప్రభుత్వం లక్నోలో కూర్చుని ఆలోచిస్తున్నది. ఇందుచేతనే యీ తేడా యేర్పడింది. వ్యవసాయపు పనిముట్లు, ఎడ్లు, నీటి పారుదల కాపలా మొదలైన వాటి విషయంలో రైతులమధ్య పరస్పర సహకారం సహజంగానే ఒనకూడుతుంది. కాని యీ సహకారం యీనాడు సంఘటితముగా లేదుగనుక సంఘటిత మొనర్పవలసి యున్నది. నేను పెద్దపెద్ద సహకార క్షేత్రి

ముల జూచియున్నాను. అందు కూలీలు గంటల ప్రకారము పనిచేయుచున్నారు. పైరు తమదనేభావం వారిలో కనపడదు. కాని పెంచుతున్నారు. దుక్కిదున్నే ఎడ్లకు వారికి భేదం లేదు. ఎద్దుకు మేతవలెనే వారికి భోజనం లభిస్తున్నది. మానసిక వికాసం యెడ్లకెంత ఉన్నదో వారికీ అంతేఉన్నది. సమాజం ఒక శరీరంలాంటిది. బుద్ధి శ్రమ రెండూ రెండు చేతులు. ఈ రెండు కలసి పనిచేయకుండా దేనికది పెడదారి ద్రొక్కితే ఆ శరీరం నసించిపోతుంది.

భగవంతుడు కొందరిని బుద్ధిజీవులుగను మరికొందరిని శ్రమజీవులుగను సృష్టించి యుండలేదని మనము గమనింపవలెను. ఈ రాహుకేతువుల మధ్య యితర దేవతలు నలిగి చచ్చుచున్నారు. యజమాని దేవుడై పోతున్నాడు. ఈస్థితి మన దేశమునకు చాల ప్రమాదకరము.

సహకారము తెలివిగా అంచనా ప్రకారం నడిస్తే చాల లాభసాటి. ఇది లేనిదే మన దేశానికి మోక్షంలేదు. చిన్న చిన్న రైతులు సరస్పర సహకారంతో కలసి పనిచేసుకొనక పోతే కాలు నిలద్రొక్కుకొనటం కష్టమేగాకుండా పంట తగ్గుదలతో పాటు భూమికూడ దెబ్బతింటుంది.

వ్యవసాయిక జ్ఞానం, అంచనా రెండూ తెలియనివారికి యిట్టిభారమైన సంస్థలను అప్పగించి చివరకు అజ్ఞానులని నిందిస్తే లాభమేమిటి? దీనివలన పేదలు చివరకు ఆశ్రితులవలెనే ఉండి పోవటం జరుగుతుంది. ఈ స్థితిని మనం కోరుటలేదు.

ప్ర॥ భూమి గరిష్ఠప్రమాణ నిర్ణయమును గురించి మీ అభిప్రాయమేమి?

అది అత్యంత ప్రమాదకరం. కనుక మనకు అపరిసక్తే అనవసరం. నేను రైతుకు రక్షణ కావాలంటున్నాను. కుటుంబానికి 5 ఎకరముల భూవసతి ఉండాలని మనము ముందు అంగీకరిస్తే ఆమీద మిగిలియున్న భూమిని యేవిధంగా చేసుకున్నా పరవాలేదు.

"మీరు చెప్పినట్లుచేస్తే భూమి చాలచిన్నచిన్న ముక్కలవుతుంది. ఇది క్రిందిచూపేగాని పైచూపు లేనట్టి వైఖరి." అని కొందరు విమర్శిస్తున్నారు. ఇందుమూలమున మనకువచ్చిన నష్టమేమియులేదని నా అభిప్రాయం. మనకు ఢిల్లీ నిర్ణయం గాదు ప్రధానం. పల్లెటూరి ఉన్నత ప్రమాణం మనము నిర్ణయించుకోవాలి. రాంచీలో 30 ఎకరాలు గరిష్ఠప్రమాణం నిర్ణయిస్తే భూమిలేని పేదలకు ఒక్కరికికూడా భూమి దొరికే అవకాశం లేదని తెలుస్తున్నది. భూస్వాములు ఉన్నభూమి నంతటిని తమ కుటుంబంలోనే పంచివేసుకుంటారు. తెలంగాణాలోకూడ యింతే జరుగుతున్నది. అక్కడ గరిష్టప్రమాణం 200 ఎకరము లుండవలయునని భావిస్తున్నారు. 30 ఎకరాల గ॥ నిర్ణయం ప్రకారమైతే యెక్కువ పరిహార మివ్వవలసి వస్తుంది. పరిహారం లేకుండా భూములను తీసుకొనలేము. గరిష్ఠప్రమాణం యెక్కువయినకొద్దీ దాని ఉపయోగం కుంచించుకు పోతుంది. గరిష్టప్రమాణం సామాన్య ప్రమాణానికి 3 రెట్లు ఉండాలని అంటున్నారు. అందరికి భోజనమేదొరకని

స్థితిలో కొంతమందికి మూడు రెట్లు భోజనం చేసేహక్కు ఎందు కివ్వాలి ? ఒకడు 1 రెట్టె మరియొకడు 3 రెట్లు భూమి సేద్యం చేయగల్గటం యెలా ఉంటుంది ? వుండనప్పుడు 3 రెట్ల భూమిపై అతనికి హక్కు దేనికి ? కాబట్టి యీ గరిష్ఠ ప్రమాణ నిర్ణయం ఫలశూన్యము. మనం యింకా ముఖ్య విషయాలనుగురించి ఆలోచించవలసి యున్నది. గ్రామంలోని భూమిఅంతా గ్రామా నిదేనని మనం భావిస్తున్నాము. ప్రభుత్వం యీ మేరకుచట్టం చేయగలదా ? గరిష్ఠ పరిమాణనిర్ణయమువలన కలిగే ప్రయో జనం ఒక్కటే. పెద్దదోపిడీదారులు కొద్దిమంది స్థానే చిన్ని దోపిడీదారులు పెక్కుమంది అవతరిస్తారు.

కొంతమంది గ॥ ప్రమాణం 150, కొందరు 200 మరి కొందరు 250 ఉండవలెనని అంటున్నారు. ధనవంతుల గౌర వాన్ని కొంతైనా కాపాడాలంటున్నారు. నేను 100, 50, 40, ఎకరాల రైతులవద్దనుండికూడ భూదానం తీసుకొంటున్నాను. ఒక గ్రామంలో కొంతమందిభూస్వాములు నావద్దకువచ్చారు. వారిని యీ ధార్మిక కార్యంచేయమని కోరగానే 20 ఎకరాల రైతుకూడ 3 ఎకరాలు దానం చేశాడు. ప్రభుత్వచట్టం 20 ఎ॥ రైతువద్ద 3 ఎకరాలు తీసుకొనలేదు. కాని హృదయపరి వర్తనవల్ల యిది సాధ్యపడుతుంది.

ప్ర॥ జమీందారులకు నష్టపరిహారమివ్వవలయునా లేదా?

జ॥ ఇప్పుడున్న చట్టాన్ని, రాజ్యాంగాన్ని అనుసరించి నష్ట పరిహారమివ్వకుండా భూమిని తీసుకోవటానికి వీలులేదు. కాని

అహింసాపద్ధతిలో దానపరిగ్రృహీత నష్టపరిహారం చెల్లించ నవసరంలేదు. పెద్ద పెద్ద వ్యాపారులు, భూస్వాములు, జమీందారులు అంతా మన సోదరులే. వారికి వారితో పాటు పేదకుకూడ న్యాయం జరగవలసిందే. 10వేల యెకరాల భూస్వామికి నష్టపరిహార మివ్వకపోవటం హింసగాదు. పెద్దపెద్ద భూస్వాములు, జమీందారులు, వ్యాపారస్థులు లెక్కప్రకారం నష్టపరిహారం తీసుకొనవలసిన అవసరంలేదు. ఈ విషయం వారికి నచ్చజెప్పగలనని నా విశ్వాసం. అవసరమైనంతవరకే వారు తీసుకోవాలి. ఇందుచేత నష్టపరిహారమునుగూడ నేను దానముగా గ్రహించుచున్నాను.

ప్ర॥ జనసంఖ్య యీ విధంగానే పెరుగుతుంటే కుటుంబానికి 5 ఎకరాలు భూమి ఉండాలనే మీఉద్దేశం యెలా కొనసాగుతుంది? భూదాన యజ్ఞానికి అంతమెప్పుడు!

జ॥ ఒకవేళ జనసంఖ్య యెల్లప్పుడూ యీవిధంగానే పెరగటంసంభవమైతే ప్రజలు కన్నబిడ్డలనుచంపి వండుకుతినటం జరిగినా ఆశ్చర్యపడవలసిన పనిలేదు. అప్పుడు ప్రజలకు నా అవసరం వుండదు. భారం యావత్తూ భగవంతునిపైనే పడుతుంది. యజ్ఞావసరం యెల్లప్పుడూ వుంటుంది. నేడు భూదాన యజ్ఞమైతే రేపు గృహదానయజ్ఞ ముంటుంది.

జనసంఖ్య యెప్పుడూ యీ విధంగానే పెరుగుతుందని మీ ప్రశ్నయొక్క అంతరార్థం. ఇదే యదార్థమైతే ప్రళయం

అనివార్యమని నా వుద్దేశ్యం. కాని మానవుడు ఆలోచనా పరుడు. అనుభవంద్వారా జ్ఞానం సంపాదిస్తాడు. సమయం మించిపోకుండానే విపత్తునుండి బైటపడతాడు. దేశంలో జన సంఖ్య పెరుగుతున్నదంటే నేను ఆమోదించలేను. జావా, సుమిత్రా మొదలైన దేశాలలో యిక్కడకన్నా యెక్కువ జనసంఖ్య వున్నదనేవిషయం గమనించండి. ఐనా యిది మనం దూరాలోచనతో పరిశీలించవలసిన విషయమే. జన సంఖ్య యెంత తక్కువైతే పురుషార్థం అంత యెక్కువగా వర్ధిల్లుతుంది. ఇందుకు మనలో శిక్షణ అవసరము.

ప్ర॥ బీదలకు కేవలం పొలం పంచిపెట్టుటతోనే పని జరగదు. వారికి యెడ్లు మొదలైన యితర సాధనాలనుకూడ సమకూర్చవలసి యుంటుంది. అవన్నీ మీరెలా లభ్య పరుస్తారు?

భూమి దానం చేసినవారే యెడ్లనుకూడ దానం చేస్తారు. సదాలోచనే పై దానాలన్నింటికీ యేకైకమూలం. నేను కాన్పూరుజిల్లాలో అడుగుబెట్టగానే అక్కడి ప్రజలు తమ 10 వేల యెకరాలభూమి కోటాపూర్తి జేశారు. "కాన్పూరు" గొప్ప వ్యాపారపట్టణం. ఈ 10 వేల యెకరాలు 200 కుటుంబాలకు పంపకం కావాలి. కాన్పూరు పట్టణవాసులు నేను అడుగగానే 2 వేల యెడ్లజతలను దానమివ్వటానికి అంగీకరించారు. విత్తనాలు మొదలైనవాటి విషయంలో ప్రభుత్వ సహాయంకూడ ఉండవచ్చు.

ప్ర॥ మానవునకు ఒకరికి పెట్టే ఉద్దేశం సహజంగా ఉంటుంది. కాని యీ కాలంలో లేదు. ఇందుకు మీరేమంటారు ?

జ॥ నేడు యివ్వకపోతే రేపుయిస్తారు. మానవునకు ఒకరికి పెట్టాలనీ ఉంటుంది. ఒకరివద్దనుండి తీసుకోవాలనీ ఉంటుంది. భగవంతుడు కేవలం యివ్వాలనే వాంఛిస్తాడు. ఇక జంతువులకు ఇవ్వటమంటే యేమిటో తెలియదు. వాటిపని యెంతవరకూ తీసుకోవటమే. మానవునకు ఇవ్వాలనే ఉద్దేశ్యమే లేకపోతే మీరు మీ పిల్లలను యితరులకు యివ్వటం యెలా సంభవం ? కాని మీరు మీ వస్తువును యితరులకు యిచ్చే ముందు నలుమూలలూ గాలించి గుణవంతుడే దొరకటం జరిగితే సంతోషిస్తారు. ఎంతో ఉపకారం జరిగినట్లుగా భావిస్తారు. అలాగే తమకున్న ఆస్తిసంతటినీ యితరులకు దానం చేయుటలో మేలున్నదని ప్రజలు భావించినప్పుడు అందుకు సిద్ధపడతారు. ఆ విషయం మనం వారికి నచ్చచెప్పాలి. మనవద్దనున్న ఒక వస్తువు మనకు నిరుపయోగమైనప్పుడు అది యెవరికి ఉపయోగపడుతుందో వారికి యివ్వాలి. ఇవ్వటంలో తనకు మేలుకలదని తెలుసుకున్నప్పుడు మానవుడు తప్పకుండా యిస్తాడు. సమాజమే అన్ని బ్యాంకులకంటె నమ్మకమైన బ్యాంకని తాను నమ్మినపుడు మానవుడు తన ఆస్తిసంతటిని సమాజపరం చేస్తాడు. ఆ విధముగా యెవరైనా చేసి చూడండి. అప్పుడు అందులో యెంత సుఖము, శాంతి, ప్రయోజనం ఉన్నదో మీకే తెలుస్తుంది. అట్టివారికి స్వవిషయాన్ని

గూర్చిన ఆలోచన లేకపోవటమేగాక ప్రజలంతా వారినిగురించే ఆలోచిస్తుంటారు. దానం యివ్వటానికి సాహసించిన వానికే తీసుకొనే ధైర్యం ఉంటుంది.

ప్రశ్న॥ మీరు బీదలవద్దనుండి దానంస్వీకరించుతున్నందున వారు మరీ బీదవారు కావటంలేదా ?

జ॥ ఔను! నిజమే. బీదవాడు తనకంటే బీదవానికొరకు త్యాగంచేసినప్పుడు అతని నైతికశక్తి ధనవంతులను సైతం కన్ను తెరిపిస్తుంది. అప్పుడు ధనవంతులు తమవద్ద యెక్కువ భూమి ఉంచుకోవటం అసంభవం.

ప్ర॥ దేశం నలుమూలలా కమ్యూనిష్టు ప్రచారం జరుగుతున్న యీ దశలో మీయీ నిర్మాణం ఆగుతుందా అనే సంశయం పొడసూపుతున్నది. మీరు యీ భూదాన యజ్ఞమే యింకా కొనసాగింపదలచారా? లేక సుస్థిర పటిష్ట సాంఘిక వ్యవస్థా నిర్మాణానికి మరొక కార్యక్రమ మేదైనా ప్రజల కందిస్తారా ?

జ॥ భూదానయజ్ఞం నిమిత్తమాత్రమైనట్టిది. ప్రజలు యే యదార్థాన్నిగాని దాని నిజరూపం వారికి సాక్షాత్కరించినపుడే అంగీకరిస్తారు. మహాత్ముల జీవిత గ్రంథంనుండి అహింసాపాఠం మనము నేర్చుకున్నాము. కాని ఆపాఠాన్ని ఆచరణలో బెట్టినవారెందరున్నారు? మహాత్ముడు స్వరాజ్య సమస్యలో అహింసను జతచేసి అనేకమందికి ఆ సాధనలో

భాగస్వామ్యం చేకూర్చాడు. స్వరాజ్యం అహింస లేకుండ సుగమం కాజాలదు. భూసమస్యకూడ అట్టిదే కనుక అహింస ద్వారా ప్రజాశక్తి ప్రకటితమైనప్పుడు దాని ప్రభావం సమాజంపైన పడుతుంది. సామాజిక, ఆర్థిక, రాజనైతిక పరివర్తనలను సాధించటానికి ఉపకరిస్తుంది. బుద్ధునినాటినుండి మనం హృదయ వికాసాన్ని గురించి చెప్పబడే మాటలు వింటూనే ఉన్నాము. కాని యీ హృదయవికాసం మానవజీవితంతో అనుసంధింపబడేవరకు సాముదాయిక ప్రయోజనం దుర్లభం.

ప్ర॥ మీరు ప్రజాహృదయంలో ద్వేషం రగుల్చుతున్నారు. భూములు యివ్వకపోతే కమ్యూనిష్టులు యెలాగైనా లాక్కుంటారనే భయం వారికి కలిగిస్తున్నారు.

ఇది చాల విచిత్రమైన ప్రశ్న. ఒకవేళ మా కృషి ద్వేషాన్నే రగిల్చినట్లయితే యిక ప్రపంచంలో ద్వేషాభావం లేని పనే ఉండదు. మేము అహింసను దృష్టిలో బెట్టుకొనే యెక్కువ మాట్లాడుతున్నాము. కమ్యూనిష్టులు భూములు లాక్కుంటారనే విషయం మేము ఒప్పుకోము. వారికి ఆపాటి సాహసంలేదు. కాని భూస్వాములుగనుక అదనెరిగి ప్రవర్తించకపోతే వారు నిల్పిన వ్యవస్థఅలాగే నిల్చియుండటం మాత్రం జరగదు.

ప్ర॥ మీరు కమ్యూనిష్టులమీదే యెక్కువగా దృష్టి కేంద్రీకరిస్తున్నారు. భూదానం కమ్యూనిజానికి వ్యతిరేకమా?

నేను కమ్యూనిష్టులను విమర్శించినమాట నిజం. విమ ర్శిస్తానుకూడా. కాని వారిని నేను యెన్నడూ దురుద్దేశ పూర్వకముగా మాత్రం విమర్శించి యుండలేదు. నేను వారిని సోదరులుగా భావిస్తున్నాను. వారు తప్పుదారి త్రొక్కుతు న్నందున వారికి తెలియజెప్పుటే నా కర్తవ్యముగా నెంచు చున్నాను. వారుగూడ నన్ను సరిగా అర్థము జేసుకొనవచ్చు. నన్ను విమర్శించవచ్చు. విమర్శించమని నాకోరిక. నా విమర్శ దుష్టముగాదు. స్పష్టము. వారొక విప్లవ సిద్ధాంతాన్ని సృష్టించారు. కాని సిద్ధాంతంవల్ల విప్లవం వర్ధిల్ల నేరదని నా భావం. వారికి కారల్ మార్క్సు చెప్పింది వేదం. ఒకవేళ ఆ మార్క్సు యీనాడు బ్రతికియుంటే వీరి సిద్ధాం తాలు అతనికి రుచించియుండేవి గాదేమో! గతాన్ని దృష్టి నిడుకొని క్రొత్త మార్గాన్ని త్రొక్కియుండే వాడేమో! గ్రంథ వ్యామోహం, శబ్దవ్యామోహం విప్లవం తేజాలవు. ఒకదేశంలో ఒకవిధంగాను, మరొకదేశంలో మరొక విధంగాను, విప్ల వాలు వర్ధిల్లుతుంటై. క్రాంతి యనునది దేశ కాల పరిస్థితులపై ఆధారపడి యుంటుంది. ఇది వారికి తెలియజెప్పవలెనని నా వుద్దేశ్యం. వారిపై నాకు చాల ప్రేమ వున్నది. వారిలో నాకు పెక్కుమంది మిత్రులున్నారు. ఒకటి రెండు చోట్ల వారు నాకు సన్మానపత్రాలు, దానపత్రాలుసైతం సమర్పించి యున్నారు. నా దారి వారికి నచ్చకపోయినట్లయితే నన్ను విమర్శించే హక్కు వారికున్నది. వారు కొంచెం ఓర్మి వహిం చాలని నా కోర్కె. నేను, వారు కోరేది పేదలమేలే. కాని యెక్కడి సరుకునో యిక్కడికి దిగుమతి చేసుకొన్నందువల్ల

లాభమేమి? వారిని నేనేమీ కటువుగా విమర్శించలేదు. ప్రణాళికాసంఘ సమక్షంలో నెహ్రూజీనికూడ భేదభావ రహితమైన యీ దృష్టిలోనే విమర్శించియున్నాను. నేను మీరు వేరనే భావం నాకు లేదనికూడ స్పష్టపరచాను. కమ్యూనిస్టు లనుగూడ అదేభావంతో నిమర్శిస్తున్నాను.

తెలంగాణా దోపిడీలను గురించి కరన్‌భాయి చేసిన విమర్శఅంతా యదార్థమే. యదార్థంచెపటంలో తప్పేమిటి! లేనిదేమీ కల్పించలేదుగదా! వారు తెలంగాణాలో కొన్ని మంచిపనులుకూడ చేశారు. కాని స్వేచ్ఛ లభించిన తర్వాత కూడ అత్యాచారాలతో పనేమిటని వారిని నేను అడిగాను. ఆత్మరక్షణకోసం అలా చేశామని వారన్నారు. తెలంగాణాలో కొన్ని దృశ్యాలు నేను స్వయంగా చూశాను. కమ్యూనిస్టులు అన్నం తింటున్న ఒక పిల్లవాణ్ని కొట్టారు. అతనితండ్రి నావద్దకు ఏడుస్తూ పరుగెత్తుకువచ్చాడు. వారుఎడ్లనుకూడకొట్టారు. పంట పాడుజేశారు. వారు యీ కర్మకాండఅంతా సదుద్దేశంతోనే జరిపి యుండవచ్చునని ఆమోదిస్తాను. మంచిని చెడ్డ మార్గాలద్వారా సాధించటం తప్పుకాదనేవారు అన్ని పక్షాల లోను ఉన్నారు. కమ్యూనిస్టులు యీ విధానాన్ని పూర్తిగా సమర్థిస్తున్నారు. ఆర్ యస్. యస్. జనసంఘ్, ముస్లింలీగ్, కొంతమంది కాంగ్రెసువారుకూడ యీ వాదాన్ని ఆమోదిస్తున్నారు. తెలంగాణాలో పోలీసు దౌర్జన్యము హద్దుమీరిన మాట నిజమేనని నేను ఆమోదిస్తాను. నేను ఆ దౌర్జన్యాలను సంస్థాన ప్రభుత్వ దృష్టికి తెచ్చాను. ప్రభుత్వం చేయగల్గిందేదో

చేసింది. అదీగాక తెలంగాణా సంకీర్తనమును నేను కోరుట లేదు. రామ సంకీర్తనము కోరుచున్నాను. నాయీ కృషిలో తప్పేమిటి? భూదానం సామ్యవాద స్థాపననే కోరుతున్నది. కాని సామ్యవాద వ్యతిరేకిమాత్రంకాదు. నా కృషి నిర్మాణాత్మకము. గ్రామ పునర్నిర్మాణంలో, శిక్షణలో, స్త్రీ పురుష సంబంధంలో అన్నిటిలో మార్పుగాని తెచ్చి ఒక నూతన ప్రపంచాన్ని సృష్టించాలని నా ఆలోచన. ఇదే సర్వోదయము. ఆధునిక విజ్ఞానంకూడ యిందుకు ఉపకరిస్తుంది. సామ్యవాద విరుద్ధమైన ఆందోళన సాగించాలనే ఉద్దేశ్యమే నాకు లేదు.

ప్ర॥ మీకు కొందరు మంచిభూములిస్తున్నారు. కొందరు బంజర్లు, బీళ్లు, తగాయిదా భూములు యిస్తున్నారు. మరి కొందరు అధికారుల ఒత్తిడివలన యివ్వటమవుతున్నది.

జ॥ నేను ఒక మహా సముద్రమువంటి వాడను. సముద్రంలో గంగ కాలువ అన్నీ కలుస్తుంటై. దేనినీ అది నిరాకరింపదు. భూమి సమస్తము నాదని నేనంటున్నాను. రాముడు అహల్యనెట్లు ఉద్ధరించాడో అట్లేమేముకూడ బంజర్లను బాగు జేస్తాము. తగాయిదా భూములు లభించినప్పటికి మాకు సంతోషమే. కనీసం తగాయిదాలన్నీ అందువలన సమసిపోగలవు. తగాయిదా భూమిని ఒక కక్షవారు దానమిస్తామంటే రెండోవారినికూడ మేము అడిగి వారు కావలెనంటే వారికే యిచ్చివేసి లేక దానమిచ్చుటకు అంగీకరిస్తే స్వీకరిస్తాము. పేచీలు తగ్గటంమాత్రం తక్కువ లాభమా?

ఒకరిని ఒత్తిడిబెట్టియెవరూ దానమిప్పించలేరు. అట్టిశక్తి అధికారులకేగాక మరెవరికిని లేదు. ఎవరైనా బలవంతముగా భూదానం చేసినట్లు మాకు తెలియవస్తే మేమా దానపత్రమును చించిపారవేయగలము. ప్రభుత్వాధికారుల నిర్బంధముతో దానమిస్తున్నారనటం తప్పు. నిర్బంధం అధికారులేగాక అందరూ చేయవచ్చు. ఒత్తిడితోనే పని చేయించదలిస్తే నేనీపనికి బూనను గదా? కాని నైతికమైన ఒత్తిడి అవసరమని నాఉద్దేశ్యం. మన పెద్దలు యీ ఒత్తిడికి పూనుకొనటంలేదని, అన్యాయాన్ని వ్యతిరేకించటంలేదని నాఫిర్యాదు. ఐచ్ఛికంగా యిచ్చిన దానమునే స్వీకరింపుమని శాస్త్రధర్మం చెపుతున్నది.

బంజర్లు బీళ్లుగా పడియున్న భూములను మేము సేద్యంలోకి తెస్తాము. ఇందుకుగాను మేము భూదానముతోపాటు సంపత్తి, శ్రమ,వస్తు, బుద్ధిదానములగూడ తీసుకొంటున్నాము. ఇక్కడ మనం మరొక విషయంకూడ ముఖ్యంగా గమనించాలి. మాకు అన్నిరకాల భూములు కావలయును. వ్యవసాయమునకు, పశుగ్రాసమునకు యింకా యేభూమి యెలా ఉపయోగపడేవీలుంటే అలా ఉపయోగించగలము. అన్నిటికంటె ముఖ్యంగా తెలుసుకొనవలసినది యీఉద్యమ మూలతత్వం. మేము అందరివద్ద దానం తీసుకుంటాము. కొంత మంచిభూమి గావచ్చు. మరికొంత చెడ్డదిగావచ్చు. ఈఉద్యమము ప్రజలలో పెద్ద నైతిక విప్లవమును గొనితెచ్చుచున్నది.

సంఘంలో జరిగే అన్యాయాలను భరింపలేక ప్రజలు ఆందోళితు లగుచున్నారు. అధఃపతితుని పైననే మనం దృష్టనిల్పాలి. ఈఉద్యమపరంగా యేర్పడిన భావవిప్లవం యెల్లెడల వ్యాపించితే భూసమస్యతోపాటు అన్ని సమస్యలు పరిష్కారము కాగలవు. సమాజము నెదుర్కొనుచున్న సమస్యలు, వాటికిమూలమైన చెడుప్రవృత్తులు అన్నీ యీవిధంగా అంతరించగలవు.

ప్రశ్న: మీకు యెక్కువగా భూమి దానంచేస్తున్న వారెవరు? చట్టంద్వారా భూస్వాములవద్దనుండి భూమి తీసుకొనటం తేలికగదా?

జ॥ మేము భిక్షుకులము. అందరినీ అడుగుతున్నాము. అందరు యివ్వవచ్చును. ఇవ్వనివారిని నిర్బంధించబోము. మావద్ద యేవిధమైన అధికారమును లేదు. అదేమాకున్న గొప్ప శక్తి. బుద్ధ భగవానునకు అధికారము లేకపోలేదు. కాని దాని వలన కొన్ని కానున్న పనులుకూడ చెడిపోవునని యాతడు భావించెను.

భూమిని ప్రోగుచేయాలనేది మాఉద్దేశ్యంకాదు. ప్రపంచాన్ని సమిష్టికుటుంబంగా దిద్దాలని మాఅభిప్రాయం. మాకు యెవరైతే భూమి దానంచేస్తున్నారో వారే మాప్రచారకులు. నేడు ప్రేమతో దానమివ్వనివారు రేపుచట్టము ననుసరించి యిచ్చెదరు. ఈనాడే మా యభిప్రాయముల నంగీకరించిన కానున్న చట్టమును బలపరిచినట్లుకాగలదు. మేము చెప్పిన

విషయములు పూర్తిగా తెలుసుకొని దానమిచ్చిన, మాకృషి పూర్తి ఫలితమునిచ్చినట్లే. అట్లుకాక ఉద్యమముపట్ల సానుభూతిపూర్వకముగా యేకొద్దిగానో దానమిచ్చినను మంచిదే. మిగిలినది తదుపరి యివ్వగలరు. ప్రజలందరిసానుభూతిని మేము కోరుతున్నాము.

ప్రశ్న:- దీనిని భూదానయజ్ఞ మనుటకంటె భూవితరణ యజ్ఞమనుట మేలుగదా? దానశబ్దము హీనతను తెలియబరచుట లేదా?

మంచి శబ్దాలు చెడ్డవారు వాడినప్పుడు వాటివిలువ పోతుంది. ఎంత మామూలు మాటలైనా మంచివారు వాడినప్పుడు రాణిస్తుంది. దానము, తపము, యజ్ఞము యివి చాల పూరాతన శబ్దములు. భగవద్గీత నుండి లభించినవి. మనము దాన వైరాగ్యములు హీనములని, సన్యాసము నింద్యార్థమని అనుకుంటే ఆ మంచిశబ్దాలు మనకు దూరమై వాటిస్థానే యితర శబ్దాలకొరకు వెదుకులాడుకొనవలసి వస్తుంది. వెదికినా లభించుట కష్టము. మనం మన అస్త్రశస్త్రములను యీవిధముగా చెడగొట్టుకొన గూడదు. బాగుగా పదునుబెట్టుకొనవలయును.

దానశబ్దమును మేము శాస్త్రార్థములోనే ఉపయోగించాము. శంకరాచార్యులు దానమంటే సమవిభాగ మన్నారు. దేశంలో ఒకవస్తువుకు కొరత యేర్పడి ఆ వస్తువు తనవద్ద అదనంగాఉంటే దానిని దేశానికి అర్పించటం మన

కర్తవ్యము. కన్యనిచ్చువాడు ఉపకార దృష్టితోనే యిస్తున్నాడు. భూదానంకూడ అట్లే చేయవలసినదిగా నా విజ్ఞప్తి. ఒక్క భూమియేగాక మీవద్దయివ్వదగిన దేమున్నను సంఘమునకు దానరూపంలో యిచ్చివేయండి. డబ్బుగాని యేయితర వస్తువుగాని మీవద్ద అనవసరముగా పడియున్నచో అవసరమైనవారికి త్వరగా పిల్చి యివ్వండి.

మేము దాన శబ్దము నిట్లు సార్థకపరచుచున్నాము. సమాజములోని కొందరు వ్యక్తులు ఆ శబ్దము నిదివరకే కొంత చెడగొట్టి యున్నారు. మేము యింకా చెడగొట్టదలచలేదు. దానశబ్దము నిజముగా చెడి నిరర్థకమైనచో మనమోడిపోయినట్లే. కాని మనకు ఓటమి లేదు. మన అస్త్రాలను మరింత పదును పరచుకొందాము.

ప్రశ్న:- భూమినంతయు మీకిచ్చిన సాముదాయిక భూములేమీ ఉండవా?

జ॥ ప్రశ్న సరియైనదే. మీరు క్రొద్దిగా భూమియిస్తారని మిమ్ము అడుగుతున్నాను. మాంగ్రోతా గ్రామంలో గ్రామస్థులందరూ తమకున్న భూమి మొత్తం దానంచేశారు. మీరుకూడ అట్లెందుకు చేయరు? ముందు మీరట్లుచేయండి. మేమేమి చేయగలమో అనంతరము పరికించండి. ఆగ్రామస్థులెవరూ గ్రామమును విడచి వెళ్ళలేదే. పశుపోషణ జరుగుచున్నదే! కనుక గ్రామభూమి మొత్తం భూదానయజ్ఞానికి యిచ్చేటట్లు చేయాలి.

పశువుల సాముదాయిక భూములను గురించి గదా మీప్రశ్న ? ఏ గ్రామములోనైనా సాముదాయిక భూమి లభిస్తే ఆ గ్రామమంతా ఆ భూమిని అలాగే ఉంచాలని కోరితే అట్లే యుంచవచ్చును. కాని మా కడపటిపథకంలో పశుపోషణకు అట్టి భూములుండాలనే ఆలోచనే లేదు. నేడు సాముదాయిక భూములలో పశువులకు రెండు నెలల మేత కూడ దొరకుట లేదు. కనుక మనుష్యులకు ఆహారపదార్థ ముల నుత్పత్తి జేసుకొన్నట్లే పశుపోషణకు గడ్డి పెంపకంకూడ అవసరం కాగలదు.

ప్రశ్న—: సామాజిక వ్యవస్థలో పరిపూర్ణమైనమార్పు రానిదే భూసమస్య పరిష్కారమగునా ? పీడితుల బాధలుస్థిర పడి, ధనికుల అధికారం సాగుతుంటే, వస్తువుల ధరలు అధికమై డబ్బువిదేశాలకు వెళ్లుతుంటే వితరణవలన పేదలకు సంక్రమించిన భూమిమాత్రం వారివద్ద యెన్నాళ్లు ఉంటుంది?

జ॥ ఈ ప్రశ్న బాగుగనేయున్నది. అడుగదగినట్టిది కూడా. మేము యీ సమస్యలన్నింటిని సులభము చేయ వలసి యున్నది. కేవలము భూమి లేనివారికి భూమినిచ్చుటకే యీ ఉద్యమము ఉద్దేసింప బడలేదు. సమాజ మంతటిలోను యిది మార్పుగొని తేగలదు. దానమడుగుట ప్రారంభక్రియ మాత్రమే. ఇందులో అందరూ అన్నిపార్టీలవారు పాల్గొన వలెనని నేను కోరుచున్నాను. భూసమస్యను సులభతరముగా వించుటేగాక అందరము కలసి సంఘ వ్యవస్థలో మార్పుగొని

తేవలెనని విజ్ఞప్తి చేస్తున్నాను. వడ్డీ యివ్వడం, పుచ్చుకోవటం సమాజమంతటా నిండియున్నది. వడ్డీవ్యాపారాన్ని వ్యతిరేకించే వారు మీలో యెవరైనా ఉంటే అట్టివారందరికంటే ఆపద్ధతికి ప్రబల విరోధి మహమ్మద్ అని నేను చెబుతాను. అతనుఖురాన్ లో 20 సార్లు వడ్డీని వ్యతిరేకించారు. మార్క్సిస్టులు తేనటువంటి విప్లవము అతడీవిధముగా కొనితెచ్చాడు.

గ్రామ భూమి మొత్తం గ్రామానికే ఉండాలని మేము కోరుతున్నాము. మనది ఒక పెద్ద సువిశాలదేశం. మీరు చెప్పినవిధంగా భూమిని ప్రభుత్వాధీనం చేయాలని నేను ఉద్దేసించుటలేదు. అందుచేత గ్రామాలకు గ్రామాలనే దానమడుగుతున్నాను. ఒకవేళ గ్రామభూమి అంతా ఒకనిచేతిలోనేఉంటే అది నాకుయిచ్చివేయమని అతనిని కోరుతున్నాను. పదిమంది చేతులలో ఉంటే పదిమందికి అట్టి విజ్ఞప్తి చేస్తున్నాను. కాని నాపని కొక విధానమున్నది.

భూదానాందోళన సమాజంలో పరివ్యాప్తమై సర్వోదయ భావ ప్రభావం సమాజంమీద పడుతుంది. అంతటితో నేటి సామాజికవ్యవస్థ అంతము కాగలదు. రాష్ట్రపతి, కూలీ ఉభయులు సమానులుగావాలని నా ఆశయం. అందుచేత యీ భూరి కార్యనిర్వాహణలో మీ అందరి సహకారమును ఆసిస్తున్నాను.

ప్రశ్న॥ ఈ భూదాన యజ్ఞమునకు జమీందారులకంటె మధ్యతరగతి, క్రిందితరగతి ప్రజలే యెక్కువ సహాయపడుతున్న మాట యదార్థమేనా?

జ॥ నాకు అందరిసహాయమును లభిస్తున్నది. కాని యిది ప్రారంభదశ.

మన దేశంలో మధ్యతరగతి క్రిందితరగతి రైతులు లక్ష లాదిమంది వున్నారు. పెద్దరైతులు, జమీందారుల సంఖ్య తక్కువ. ఇందుచేత నాకు చిన్నరైతుల సహాయమే యెక్కు వగా లభిస్తున్నది.

కాశీ, హజారీబాగ్, మొదలైన కొన్నిచోట్ల పెద్దవారు కూడ భూదాన మిచ్చియున్నారు. దానమడుగుటే యీ యుగ ధర్మం. మానవహృదయం తప్పనిసరిగా కరుగుతుంది.

ప్ర॥ వర్గ సంఘర్షణవలననే జమీందారులలో సహకా రబీజము మొలకెత్తుచున్నది. వారు వర్గ సంఘర్షణ భావి పరి ణామాలను గుర్తించి మీ భూదాన యజ్ఞమునకు సహాయ పడుతున్నారు. ఇది నిజమేనా?

జ॥ భూదాన యజ్ఞమునకు జమీందారుల తోడ్పాటు తక్కువగా నున్నదని మీరింతకు ముందేగదా చెప్పియున్నారు. మళ్లీ యింతలో ఆ జమీందారులే మాకు యెక్కువ సహాయ పడుతున్నారని అంటున్నారు. ఈ రెంటిలో యేదినిజమో మీరే తేల్చిచెప్పండి. నేను జమీందారుల రక్షకుడనని ఆరోపింపబడు చున్నది. కాని వినోబా అందరిని రక్షిస్తాడు. ఆయన జమీం దారులను, గాంధేయులను, సోషలిస్టులను, జనసంఘ్, ఆర్. యస్. యస్, కిసాన్ మజుదూర్ పార్టీలవారిని, యీ దేశాన్ని, ప్రభుత్వాన్ని, విదేశీయులను అందరిని ఇందుకు సహాయపడమని కోరుతున్నాడు. నేనొక విశ్వమానవుడను. ఆవిశ్వహృదయాం

తరాళంనుండి భగవద్వాణి వినిపిస్తున్నది. అందరి సహాయ మును ఆసిస్తున్నాను.

ఆంగ్లేయులు హృదయంకరిగి యిక్కడినుండి వెళ్ళిపోయారా అని ప్రజలు ప్రశ్నిస్తున్నారు. హృదయ పరివర్తన కలిగిన కారణంగానే వారు వెళ్ళలేదని నేనుఒప్పుకుంటాను. కాని వారు బుద్ధిమంతులుగనుక వెళ్ళిపోయినారు. ఇట్లే రాజులు, మహారాజులు కూడ తెలివితేటలతో, రాజ్యం వదులుకున్నారు. జమీందారులలో కూడ కొందరు హృదయపరివర్తన కారణంగాను, మరికొందరు గత్యంతరంలేకను భూదానం చేస్తున్నారనే దానికి కొందరు అంగీకరింపవచ్చును. అట్టివారితో నేను ఏకీభవిస్తాను. భగవత్కార్యము పెక్కువిధాల జరుగుతుంది. ఎవరైనా వర్గ సంఘర్షణ బెడద తప్పించుకోవాలనే ఉద్దేశంతో దాన మిచ్చుచున్నట్లయితే అందులో తప్పేమిటని నే నంటున్నాను. ఎవరైనా అగ్నిప్రమాదానికి భయపడి గ్రామం వదలిపెట్టి వెళ్ళితే వారు చెడుపని జేసినట్లేనా? ప్రక్కలో పామున్నదని అది కరుస్తుందని ఆప్రక్క వదలివేస్తే, శంకరాచార్యుడు శుకాచార్యుడు మొదలైనవారివలె విరక్తిభావంతో నేనాపని జేయకపోయినా అందుతప్పేమున్నది? ఇది పోరాటాన్ని నివారించే దృష్టి మాత్రం కాగూడదా? భూమి దానమిస్తే చెడుపని చేసినట్లేనా? ప్రజలకు వర్గపోరాటములోనే విశ్వాసమున్నదని మీఉద్దేశమా? ఒకవేళ ఆ పని వర్గపోరాటంలేకుండా జరిగిపోతే మీకువచ్చే నష్టమేమిటి? దీనినిగురించి విచారపడవలసిన అవసరము లేదుగదా?

ప్ర॥ భూదాన యజ్ఞం కొరకుయెవరైనా బ్రహ్మచర్యం అవలంబించ దలిస్తే దానిని గురించి మీా అభిప్రాయమేమిటి?

జ॥ భూదానయజ్ఞం కొరకు విద్యార్థిదశ మొదలు మరణ పర్యంతం బ్రహ్మచర్య మవలంబించవలసిన పనిలేదు. రెండు నుండి 4 సంవత్సరాల నియమం అవసరం. ఈ నాలుగు వత్స రాలకాలంలో యీ పని పూర్తి యవుతుంది, బ్రహ్మచర్యానికి ఆత్మప్రేరణ ఉండాలి. ఆప్రేరణకు బయటనుండి నిమిత్తమాత్ర మైన ప్రేరణ లభ్యపడినపుడే బ్రహ్మచర్యం లాభకారి కాగ లదు. భీష్ముని జీవితంలోను, గాంధీజీ జీవితంలోను యిదే జరిగింది. గాంధీజీ సామాన్యప్రజల సేవకొరకై బ్రహ్మచర్యం పూనినారు. ఇది ఉత్తమ బ్రహ్మచర్యంగా పేర్కొనబడింది. అసలు ఆత్మప్రేరణఉండి యీభూదాన యజ్ఞము నిమిత్తమా త్రమైతే అప్పుడు బ్రహ్మచర్యమువలన లాభముంటుంది. కాని ప్రత్యేకించి యీ పనికొరకు బ్రహ్మచారి కావలసినపని లేదు.

ప్ర॥ విద్యార్థులమైన మేము భూదానంతోపాటు జ్ఞాన దానం కూడ యెట్లుచేయగలము?

జ॥ నేటి విద్యార్థులందరిలో జ్ఞానమున్నదా లేక అజ్ఞాన మున్నదా అనేవిషయం ఆ భగవంతునకే తెలియాలి. కాని వారు జ్ఞానమునే అభిలషించుచున్నారు. వారు బాగా చదవా లనే నేనుకోరుతున్నాను. నేడు చాలమంది విద్యార్థులకు భూదాన యజ్ఞమునుగురించి యేమీా తెలియదు. ఇందుచేత వారిప్రశ్నలన్నిటికి పూర్తివివరణ తెలుసుకొని యుండవలెను.

మా ఉద్యమానికి వారివ్వవలసిన సహకారం యింతవరకే. రెండవది. వారు కనీసంరోజుకొక గంట శరీరశ్రమ చేస్తుండాలి. నేటి విద్యావిధానంలో శరీర శ్రమకు స్థానమేలేదు. కాయ కష్టము జేయగలిగినవారందరికి భూమియివ్వాలని భూ దాన యజ్ఞం అంతర్గతోద్దేశం.

ప్ర॥ గవర్నమెంటువారిని కూడ కొంత భూమి దాన మిమ్మని అడగదలచారా?

జ॥ ముందుగానే గవర్నమెంటును అడుగుటతప్పు. దాని వలన జనశక్తి దెబ్బదింటుంది. భారతి ప్రభుత్వంఒక కోటియకరాలు యిస్తానని సూచించింది. జనశక్తినిముందు మేల్కొలిపి తరువాత మీవద్ద తీసుకుంటామని మేము వారికి తెలియబరచితిమి. మొట్టమొదట జనశక్తిని మేల్కొల్పుటద్వారా భూసమస్యను తేలికపరచుటే మన కర్తవ్యమని, యిప్పటికి దానంగా లభించినభూమినంతటిని వితరణ జేసినతరువాత ప్రభుత్వం యిచ్చేభూమికూడ తీసుకొనవచ్చునని పంత్ గారు ఉత్తర ప్రదేశ్ భూదాన సమితికి వివరించి యున్నారు.

ప్ర॥ మీ దృష్టిలో చెడ్డవారంటే యెవరు?

జ॥ దేశీయ కార్యంలో యెవరు సహాకరించుటకు నిరాకరింపెదరో వారే చెడ్డవారు.

ప్ర॥ ఇక్కడ (బీహారు) దాదాపు 4వ వంతుమాత్రమే భూమియున్నది. తమరు అందరికి భూమి యివ్వలేరుగదా?

?

జ॥ ఇవ్వలేము. భూమి లభ్యపడనివారికి వృత్తిపని చూపిస్తాము. మొత్తం భూమిలో 8వ వంతు లభించివృత్తి పనులు కూడ దానికి తోడైతే సమస్య తేలికపడుతుంది.

ప్ర॥ కానితమరు ప్రతిగ్రామంనుండి 5 యకరాలు మాత్రమే అడుగుతున్నారు గదా?

జ॥ అది కనీసకోర్కె. గ్రామానికొక సర్వోదయ కుటుంబమైనా ఉండాలని అందలిభావము. ఇది తక్కువలో తక్కువ. ఏదో మేముకూడ యిందు చేరితిమనిపించుకొనుటకు మాత్రమే యిది ఉపయోగపడుతుంది. ప్రతికుటుంబం, దరిద్ర నారాయణునొక యింటి సభ్యుడుగా పెంచాలని మా ఉద్దేశం. అందుచేత ఉన్న భూమిలో 6వ వంతు జనశక్తినుండి సంపాదించ వలెనని అభిలషిస్తున్నాము.

ప్ర॥ ఈ పనిఫలితంగా అన్ని సంస్థలు, అన్ని పార్టీలు పరిశుద్ధం గాగలవని మీరంటున్నారు. అట్లయితే కమ్యూనిష్టు పార్టీ కూడ పరిశుద్ధము కాగలదని మీరు భావిస్తున్నారా?

జ॥ అవును. ఎందుకు జరగదు? వారుకూడ మనలోని వారే. వారు ఈశుద్ధికి అతీతులా? సమస్య తేలికపడుతున్నదని గ్రహించినప్పుడు యీ దారిదొక్కితే గౌరవము లభించగల దనుకుంటే వారుకూడ మనవెంట వస్తారు. నేటికి 12 లక్షల ఎకరాల భూమి లభించింది. ఇది చాలపెద్దపనే. కాని యింతటి తోనే సమస్య సులభతరముకాదు. సమస్య సులభతరమైనప్పుడు వారుకూడ మనను అనుసరిస్తారు నేడు మనతో వారికి భేధా

భిప్రాయములున్నవి. కాని దానపత్రాలు, సన్మానపత్రాలు సమర్పిస్తున్నారు. పని జరుగుతున్నదనే నమ్మిక కలిగినప్పుడు వారుమాత్రం హింస నెందుకవలంబిస్తారు? వారు త్యాగులు. శ్రమికులు, దీక్షాపరులు. వారికి విప్లవముకావాలి. హింసా వ్యామోహము కొద్దిమాత్రమే యున్నది. తెలంగాణాలో వారికి నచ్చచెప్పుటకు నేము చాలప్రయత్నించాము. అప్పుడు వారు వినలేదు. కాని తరువాత కొంత ఆలస్యంగానైనా తమ పోరాటమును విరమించుకొన్నారు.

ప్ర॥ బీదలు తమకు దారిదొరికేవరకు యెంతకాలమిట్లు ధైర్యము వహింపగలరు.

జ॥ ప్రజలను ఒకనిర్దిష్టమైన దారిలో పెట్టవలెనని నా కోరిక. అందుచేత నేటిపరిస్థితిని అతిత్వరగా మార్చాలని కోరుతున్నాను. నేను శాంతిమాత్రమే కావాలంటున్నాను. ఎందుకు? నిజమైన శాంతికొరకు. స్మశానస్థితికి బదులు మరే స్థితికైనా నేను సమ్మతించగలను. నేను శాంతిని గురించి మాట్లాడుతున్నాను. గనుక చెడ్డవాడినని యెవరో చెప్పి యుంటారు. అవును. నేను తప్పకుండా చెడ్డవాడినే. నేటి పరిస్థితులు యీ విధంగానే స్థిరంగాఉండాలని కోరేవారికి, బాధ్యతను గుర్తించనివారికి, అవసరమైన సమయంలోకూడ పని యేమాత్రం చేయకుండా తమ డబ్బు సంచి మూతులు బిగించుకొంటున్నవారికి, యీ సామాజికవ్యవస్థ మారకుండా ఉండవలెనని ఆశించేవారికి నేను తప్పనిసరిగా చెడ్డవాడినే. నేను శాంతిని ఆపవలెనని కోరుటలేదు. కాని సరియైన దారిని

దానిని ప్రవేశపెట్టాలని కోరుతున్నాను. గాంధీజీ సంవత్సరం కాలంలోనే స్వరాజ్యం తెస్తానని చెప్పారు. కొంత ఆలస్యంగానే స్వరాజ్యం లభించినా ఆయన అహింసామార్గంచేతనే దానిని సాధించుటకు ప్రయత్నించారు.

రష్యాలోను, చైనాలోను పనులు వెంట వెంటనే జరిగిపోతుండగా యిక్కడ యేకారణముచేత జరుగుటలేదని ప్రజలు నన్ను ప్రశ్నిస్తుంటారు. కాని హింసతో క్రాంతి యేర్పడిన తరువాత అక్కడ పనులు జరిగినవనే విషయం వారు మరచిపోతున్నారు, ఈ ఉద్యమమువలన బీదలు నిరాశకులోనై, ధైర్యము గోల్పోయి హింసకు పూనుకొనగలరని కొందరంటారు. నేను హింసను కోరుటలేదు. హింసను ఆపుటకే యీ ఉద్యమం. నేను స్మశానశాంతి వాంఛింపను. ఒకవేళ నాఉద్యమ ప్రభావం బాగాపాదుకొంటే భూమినివ్వనివారి సంఖ్య చాలతక్కువే ఉంటుంది. అందుకు యేవిధమైన హింస అవసరములేదని విశ్వసిస్తున్నాను. కనుక హింసను వ్యతిరేకించెడివారే యీ ఉద్యమములో చేరవలసి యున్నది. నేటి పరిస్థితి స్థిరంగా ఉండిపోవాలనికోరేవారు హింసనుండి తప్పించుకొనలేరు. నేను హింసను కోరుటలేదు. కాని నేటిపరిస్థితులను కూడ సహింపలేను.

ప్ర॥ కరుణ ద్వారా భూ సమస్య సులభతరము కావలెనని మీరు చెప్పెదరు. గాంధీగారిది కూడ యిదేమార్గము. కాని వారు కరుణతోపాటు సత్యాగ్రహముకూడ అవలంబించారు, గాంధీజీవలె మీరుకూడ సత్యాగ్రహము నెందుకు

చేయరు? చేస్తే, భూమి లేనివారిలోను పేదలలోను ఆత్మ విశ్వాసం, నూతనోత్సాహం యేర్పడి వారంతా సంఘటితము కాగలరుగదా!

జ॥ నాపని సత్యాగ్రహమే. సత్యాగ్రహమునకుకూడ పరీక్ష యుంటుంది. ముందు ఆ అధికారం సంపాదించుకొనవలె నంటే బీదవాడు కూడ తనసంపదలో కొంత దానం చేయాలి. ఎందుచేత? బీదవానికొరకు ప్రత్యేకమైన సత్యాగ్రహ పరీక్ష అంటూ లేదుగనుక. ఒక్కపీడనే గాకుండా బీదవారికింకా యెన్నో కొరతలుండవచ్చును. ఈ బీదవారే భూమి దానం చేస్తుంటే నైతికశక్తి పెరుగుతుంది. పేదలు ఉద్యమభావమును గ్రహించి ఆచరణలో పెడతారు. అటుమనం పెద్దవారివద్దనుండి కూడ భూమితీసుకొని ఉద్యమభావంగల ప్రజలను పెంచగలము.

ఈవిధముగా మనమిశ్రమసేన తయారవుతుంటుంది. ఈ సేనలో పేదలుధనికులు అందరూకలుస్తారు. కట్టకడపటి మార్గం లో సత్యాగ్రహము అవసరముకాదని నేను చెప్పను. తండ్రి జబ్బుతో ఉన్నప్పుడు కొడుకుఉపచారము చేయుటకే ఆలోచిం చగలడుగాని అంత్యక్రియలనుగురించి ఆలోచించడుగదా! ఒక వేళ తండ్రి మరణించితే అంత్యక్రియలుకూడ జరుపుతాడు. కనుక సత్యాగ్రహము కట్టకడపటి సాధనముమాత్రమే. దానికి ముందు చేయవలసిన పని చాలావున్నది. నాకు యేకొద్దిగా రవమున్నా అదిసత్యాగ్రహిగా లభించినది మాత్రమేనని మీకు తెలుసు. ఒకవేళ భూస్వాములు భూములను విడచిపెట్టకపోతే మనమిశ్రమసేన అందుకు పూనుకొంటుంది. ఇప్పుడు భూమి యున్నవారంతా త్యాగం చేయవలసియున్నది.

సత్యాగ్రహముమాని భూదానయజ్ఞములో లీనమై పని జేయవలసినదిగా సమాజవాదులను కోరినాము. ఇదికూడ ఒక విధమైనసత్యాగ్రహమే. ఒకవేళ యెక్కడైనా పేదలమీద మితిమీరి అత్యాచారములు జరుపబడుతుంటే మా కర్తవ్యమేమిటని వారు నన్ను ప్రశ్నించారు. మీరు వెంటనే ఆచోటికి వెళ్లి ఆనిప్పు ఆర్పివేయుడని వారికి సమాధాన మిచ్చితిని. నిప్పు అంటుకొంటే ఆర్పవద్దనిమాత్రం చెప్పలేదు.

ప్ర॥ నేటివర్ణవ్యవస్థ సరియైనదని మీరుభావిస్తున్నారా?

జ॥ వర్ణవ్యవస్థ అనునది లేనేలేదు. తండ్రి వృత్తిని పుత్రుడు అవలంబించుటే వర్ణవ్యవస్థ. దానిలోకూడ అతనికి యితరపనిలో లభ్యపడునంత కూలి లభిస్తుంది. అన్ని వృత్తులు సమానమని ఆవ్యవస్థఅర్థం. కాని నేడు అట్లులేదు. అందుచేత నేటి పరిస్థితిలో వర్ణవ్యవస్థ యనునదిలేనేలేదు. ఒక వర్ణస్థుడు తన కులవృత్తిదప్ప యితరపని జేయడని దానియర్థము కాదు. బాల్యమునుండి కులవృత్తిలో కొంతఅభ్యాసముంటుందని అందలి భావము. నేతగాని పిల్లవాడున్నాడనుకొనండి. అతనికి బాల్యమాది నూలుకండెలు చుట్టటం యిత్యాది పనులు నేర్పుతారు. ఒకవేళ ఆపిల్లవాడుకూడ నేతవృత్తినే అవలంబిస్తే తొందరగా స్వావలంబి కాగలడు.

ప్ర॥ తమరు భూదానమునకుగాను హరిజనులనందరినీ సంఘటితము జేయాలిని ఆలోచిస్తున్నారా?

జ॥ సంఘటితం చేయడమంటే మాకు యెక్కువయిష్టం లేదు. ఈరోజులలో కూలి, యజమాని, హిందువు, మహామ్మ

దీయుడు మొదలైన వారందరూ సంఘటితమగుచున్నారు. కాని యిది వ్యర్థమని మా భావం. ఇందుకు బదులు మానవత్వాం పెంచాలంటే మేము ఒప్పుకుంటాము. కరువు ప్రాంతాలకు జేయబడే సహాయంలో కూడ మహమ్మదీయులకని హిందువుల కని ప్రత్యేకించి చెప్పటం జరుగుచున్నది. ఇది చాల పొరపాటు. ఇందువలన మేము యేవిధమైన సంఘటనను (కలయికను) ఆమోదించుటలేదు. మనహద్దు మనజాతికి లేక మన ఫిర్కాకు మాత్రమే పరిమితమై యుండరాదు. పరివ్యాప్తంగా ఉండాలి. మా భూదానయజ్ఞము ఫలానాజాతికి లేక ఫిర్కాకు చెందినదని యెవరైనా అనగలరా? అందరికి యిందుస్థానమున్నది. కాని ఒక్కవిషయం. ఎవరైతే యెక్కువ వెనుకబడీయుంటారో వారికి మనం యెక్కువ సేవజేయవలసి యుంటుంది. అది సర్వోదయం పేరిట జరుగుతుంది. కుటుంబంలో అశక్తులకు యెక్కువ సేవ జేస్తాము. అది కుటుంబసేవ యనబడుతుంది. అట్లే సంఘంలో యెక్కువగా వెనుక బడియున్న వారికి జేయబడే సేవ సంఘసేవ యనబడుతుంది. హిందూధర్మం భూతసేవను మాత్రమే పేర్కొంటున్నది. ఇందు హృదయౌదార్యం ప్రస్ఫుటమగుచున్నది. కాని సేవమాత్రం దరిదాపులలో మాత్రమే ఉండిపోతుంది. మేము వాస్తవానికి యీ బేధమే లేకుండా జేయాలని కోరుతున్నాము.

ప్ర॥ నేడు పాకీపనివారిస్థితి చాలశోచనీయంగా ఉన్నది. వారినిగురించి మీరేమి ఆలోచించుచున్నారు?

జ॥ ఒక పాకీస్త్రీ మమ్ము భూమి అడిగింది. నీవు భూమి సేద్యం చేయాలనుకొంటే మేము తప్పకయివ్వగలమని మేము

ఆమెకు చెప్పాము. కాని దానితో ఆమెవృత్తి పోతుంది. పాకీ పిల్లవాడు వ్యవసాయంలో శిక్షణ పొందాలనుకొంటే మేము అందుకు తగ్గయేర్పాట్లు చేస్తాము. శిక్షణపొందిన అనంతరం పొలము యివ్వగలము. అతనికి వ్యవసాయమంటే తెలియన ప్పుడు మేము ఒకవేళ పొలం యిచ్చినా ప్రయోజనం లేదు. పాకీవారికి వారిపిల్లలకు నేత, వడ్రంగం, చెప్పులుకుట్టటంమొద లైన యితర వృత్తులలో శిక్షణ యేర్పాట్లు చేయాలి.

ప్ర॥ సర్వోదయ సమాజంలో హరిజనులకున్న స్థాన మెట్టిది ?

జ॥ సర్వోదయసమాజము ఒక మహాసముద్రమువంటిది. అందు యేనదికీ ప్రత్యేకస్థానం లేదు. ముందు కాల్వలు, నదులు ఉంటేగాని సముద్రానికి అస్తిత్వం లేదు. హరిజనులనే బేధభావం నశించినప్పుడు సర్వోదయ మేర్పడుతుంది. సర్వోదయ సమాజము తయారవుతూ అవుతూన్న వస్తువువంటిది. నేటి సమాజమునే సర్వోదయ సమాజంగా తయారు జేసుకొన వలసి యున్నది. సముద్రములో నదికున్న స్థానమేమిటని మీరు మమ్ము ప్రశ్నిస్తే సముద్రంకన్న నదికే ప్రథమస్థాన మున్నదని మేము చెపుతాము. సర్వోదయములో వైషమ్యమునకు తావు లేదు. సర్వోదయసమాజ మొక రాజకీయ పక్షమైతే అందు మా హరిజనులకు స్థానముంటుందా ఉండదా అని మీరు ప్రశ్నిస్తే ఆసమాజం యేర్పడిన తరువాత యెవరు యెన్నుకొన బడినా వారందరూ మా ప్రతినిధులేనని మేము తెల్పెదము. ఎప్పటివరకు యిది జరగదో అప్పటివరకు యీ సమాజం

రేర్పడదు. సర్వోత్తమ మేర్పడాలంటే మనభేధాలన్నీ సమసి పోవలసి యుంటుంది.

ప్ర॥ వ్యవసాయం, గ్రామ కుటీరపరిశ్రమలు రెండూ సీతారాముల వంటివని తమరు చెప్తున్నారు. గ్రామ కుటీర పరిశ్రమలు లేకుండా భూదానం సఫలత నొందజాలదు. ఈ యంత్రయుగములో కుటీర పరిశ్రమలు యెలావర్ధిల్లగలవు?

జ॥ ఇది యంత్రయుగము కాదు. మన యుగము. దీనిని ఆచరణలో బెట్టి జూచినతర్వాత నాకీ అనుభవము గల్గినది. యిది యంత్రయుగ మైనప్పటికీ నేను ఢిల్లీలో తిరగలి విసిరితిని. ఆ తిరగలినుండికూడ పిండి వచ్చినది. కాని మన ప్రభుత్వం శరణార్థులకు గోధుమలు యివ్వకుండా పిండియిచ్చేది. కారణం, యంత్రయుగములో తిరగలి పనిచేయదని వారినమ్మకం. ఢిల్లీ వారికి గోధుమలంటే తెలియకపోవచ్చు. వారుపిండితప్ప గోధుమలు చూచియుండరు. ఇంకా అమెరికాలోని పిల్లలు గోధుమలు, పిండి రెండూ యెరిగియుండకపోవచ్చు. వారికి కేవలం నానురొట్టె మాత్రమే తెలియును. ఒకవేళ తిరగలివిూదపిండి రానివక్షంలో యిది యంత్రయుగమేనని నేనుచెప్పవలసివచ్చేది. కాని యుగంమాత్రంమనశక్తినిగాని, రాట్నమునుగాని పారద్రోలజాలదు. మనము కావాలంటే ప్రతిఫలము తీసుకొనవచ్చును. మన పూర్వులు బ్రహ్మవ్రాలుమీాద నమ్మకం కలిగి కలియుగవాదులుగా తయారైనారు. నేటిప్రజలుగూడ అట్లేనడుస్తున్నారు. ఇదిమాత్రం కలియుగం కాదు. విజ్ఞాన యుగం. విజ్ఞానం యొక్కసహాయం చిన్నపనికీ, పెద్దపనికకూడ లభిస్తుంది.

మనం యెట్టి ప్రతిఫలం కావాలని ఆదేసిస్తే అట్టి ప్రతిఫలాన్నే విజ్ఞానం ప్రసాదిస్తుంది. మిల్లును, రాట్నాన్ని సృష్టిస్తుంది. ప్రతి సమాజంలోను వొకేయంత్రం పనిజేస్తుందని దీని యర్థము కాదు. వొక దేశంలో పనికిరాని యంత్రము మరొక దేశంలో పనికిరావచ్చు. ఒక కాలములో పనికివచ్చిన యంత్రము మరొక కాలంలో పనికిరాకపోవచ్చు. ఈవిధంగా యంత్రము యొక్క ఉపయోగము దేశకాల పాత్రములబట్టి యుంటుంది. ఏది యీ దేశంలోని ప్రజలందరికి పని లభిస్తుందో అదే మనదేశానికి అనుకూలమైన యంత్రము.

ప॥ మేము యీ భూదాన యజ్ఞమున కేవిధంగా సహాయ పడగలం ?

జ॥ ఒక హరిజనునకు కొద్దిగా భూమివుందనుకోండి. అతడది దానమివ్వవచ్చును. భూమిలేకపోతే శ్రమదానం చేయవచ్చును. శ్రమదానం చేయలేనివారు సంపత్తిదానం చేయవచ్చును. సంపత్తిదానమంటే డబ్బుయివ్వటంగాదు. అందు ఒకభాగం యివ్వాలి. యే 20వ వంతో 16వ వంతో యివ్వటమేగాకుండా గ్రామ గ్రామం వెళ్లి యీప్రచారం విరివిగా చేయవచ్చును.

ప్ర॥ మీరు భూదానంద్వారా ధనికవాదానికి మెరుగులు దిద్దుతున్నారా యేమి ?

జ॥ మేము ధనము లేకుండా భూమిం అడుగుతున్నాము. అలా కోరేవారే కమ్యూనిష్టులు. ఇందుకు వారు యిష్టత

వలసియున్నది. మేము ధనమునుకూడ దానము తీసుకొనుచున్నాము. ఈప్రయత్నం ప్రజల మంచితనాన్ని బహిర్గతం చేస్తుంది. అట్లుగాక వారుదీనిని చెడుగా అర్థము చేసుకొన్నట్లయితే వారికి శిక్షణఅంటే యేమిటో తెలియదని నేను అనవలసి వస్తుంది. మానవ హృదయంలోని చెడును అరికట్టి మంచిని బహిర్గతమొనర్చుటే శిక్షణయొక్క అర్థము. మనము వీధిలోనికి మురికిని గోతిలో పూడ్చిపెడుతున్న విధంగానే మానవ హృదయంలోని చెడును కూడ బహిర్గతం కాకుండా కప్పివుంచ్చాలి. మనసందేశం ప్రతిమానవుని హృదయంలోను ప్రవేసించాలి. ప్రజలలోవున్న మంచిని మెచ్చుకోగల్గాలి, అట్లు చేసినట్లయితే క్రమేణా వారిహృదయం మంచిగా మార్పుజెందుతుంది. కేవలము శ్రీమంతులలోనే చెడు వున్నదా? బీదలందరిని పుణ్యశీలురలోనే లెక్కగట్టవలెనా? పేదలలోకూడ అనేకమంది త్రాగుబోతులు, సోమరులు వున్నారు. మేము భూదానంద్వారా ప్రజలలోనున్న మంచిని బహిర్గతము జేయుచున్నాము. దీనివలన క్రాంతి వర్ధిల్లదా యేమి? ధనిక వాదమును నిరోధించలేమా యేమి?

ప్ర॥ ప్రతి యొక్కరు 6వ వంతు దానం చేస్తున్నారో లేదో తమరెలా తెలుసుకొనగల్గుచున్నారు?

జ॥ మేము మధ్యవర్తులము కాగోరుటలేదు. ఎవరు యెంత యివ్వవలెనో వివరించటం మాపనిగాదు. మేము 6వ వంతు అడుగుతున్నాము. ఎవరు యెంత యివ్వగలిగితే అంత యివ్వండి. మేము యెవరిని శాసించము.

ప్ర॥ మీరు సేన, దాడి, యుద్ధము మొదలైన పదాలు ప్రయోగిస్తున్నారు. ఈ పదాలు కొందరిమనస్సులలో సందేహ మంకురింప చేస్తున్నవి. ఈయన దండయాత్రను గురించి యుద్ధాలనుగూర్చి చెపుతున్నాడని వారుభావిస్తున్నారు.

జ॥ నేను యుద్ధమే కావాలనుకుంటే బీదలవద్ద నుండి దానము కోరనుగదా! బీదలవద్దనుండి అంతకంటే నిరుపేదల కొరకు దానము తీసుకొంటున్నాను. దానితో ఒకగొప్పవాతావరణమేర్పడుచున్నది. ఈవాతావరణ ప్రభావము పెద్దవారి మీదకూడ పడుచున్నది. మనము చిన్నవారివద్దనుండి దానము తీసుకొంటుంటే పెద్దవారు వేలు, లక్షలయకరాలు దానమిచ్చియున్నారు. ఈ నైతిక వాతావరణము పెద్దవారిని మేల్కొలిపి వివేకవంతులను జేయుచున్నది. నామాటలలో దాడిఅనే పదానికి అర్థమిది. మేము కేవలము ధనవంతులనే దానమడిగి వారికి వ్యతిరేక వాతావరణము సృష్టించడానికి పూనుకొని యుంటే అప్పుడు మామీద యుద్ధనేరం మోపవచ్చును. కాని మేము చిన్నచిన్న రైతులందరిని దానమడుగుతున్నాము. చిన్నా, పెద్ద అనే తారతమ్యం పాటించుటలేదు. ఈకారణంగా, ఇందు యుద్ధాలకు తావులేదని నిస్సంశయంగా తేలిపోతున్నది. భూమినిచ్చే దాతలందరు మా సైన్యంలో చేరిపోతున్నారు. ఇందువలన నైతికంగా పెద్దమార్పు వస్తున్నది. ఈమార్పు ప్రభావం మీరుశత్రువులుగా భావిస్తున్నవారిపైని గూడ పడుతున్నది. ఈ నైతిక పరివర్తన మామాటకుశోభగూర్చి, మాపద్ధతిని విస్తృతంచేస్తున్నది.

పనిమాని యజమానితో జగడము పెట్టుకోవద్దని నేను కూలీలకు సలహాయిచ్చాను. పని అంటే పూజ. అదిమన పవిత్రకర్తవ్యం. అసేన యజమానికొరకు కాదు. యజమానితో యుద్ధము చేయవలెనంటే యితరసాధనాలు చూచుకోవాలి. శ్రమజీవులు, చిన్నరైతులు దానమివ్వటం మొదలుబెడితే పెద్ద యజమానులు కళ్లుదెరచి వివేకం పెంచుకొంటారు. మా యుద్ధాలలో తొలి ఆక్రమణ యిదే.

ప్ర॥ 1946 నుండి నేటివరకు బీహారులో షుమారు 10 లక్షల యకరాల పొలమునుండి రైతులను తొలగించటం జరిగింది. ఆ అన్యాయం యింకా జరుగుచునే యున్నది. ఒకవంక లక్షల యకరాలభూములనుండి రైతులు తొలగింపబడుతుంటే మరొకవంక మనం భూమిని నాలుగైదు ముక్కలుగా చీల్చుతుంటే భూసమస్య మరింత క్లిష్టం కావటం లేదా? అట్టి తొలగింపు అన్యాయమని ప్రతిసభలోను మీరెందుకు వ్యతిరేకతను తెలియజేయరు?

స॥ నేను తమతో యేమిచెప్పను? దానిని గురించి పూర్తి వ్యతిరేకతను తెల్పియున్నాను. కాని నాకు కేకలువేసి గల్లంతుచేయటం చేతగాదు. మీరు భూములనుండి తొలగిపోవద్దని కౌలు రైతులకు వివరించాను. మీరు మీ భూములలో శాంతంగా కదలకుండా కూర్చోండి. ఒకవేళ మిమ్మల్ని ఎవరైనా కొట్టవస్తే కొట్టనివ్వండి. ద్రౌపది వలువలు లాగిలాగి దుశ్శాసనుని చేతులు అలసిపోయినట్లే మిమ్ము కొట్టి కొట్టి వారి చేతులు కూడ అలసిపోగలవు. దీనివలన అందరిలోను కదలిక

వస్తుంది. ఉత్తర ప్రదేశ్ ప్రభుత్వం యిట్టితొలగింపును ఆపివేసింది. బీహారులో కూడ యిది జరగాలని నాకోరిక. నేనుమాత్రము అట్టి అన్యాక్రాంత భూములనుకూడ దాన మడుగుతున్నాను. ఆభూమిని తిరిగితొలగింపబడిన రైతులకేయిస్తున్నాను. రైతులను భూములనుండి తొలగించిన వారిపాపం యీవిధంగా పరిహార మౌతుంది. వారు పవిత్రులవుతారు. వారిని నిందించాలని నా కోర్కెకాదు. వారిని పవిత్రులను చేయాలని నా కాంక్ష. కాని నాకు కేకలువేయుట తెలియదు. పనిచేయుట మాత్రం తెలియును. 'హృదయ పరివర్తన' అంటే మీరంతా యెగతాళిజేస్తారు. కాని మీలోనే ఆహృదయపరివర్తన జరుగుతున్నదని నేను చెప్పుచున్నాను. ఏలనన మార్క్సు వ్రాసిన ఒక గ్రంథమే హృదయపరివర్తన గొనితెచ్చినది. అతడుతుపాకీ లాఠీచేతబట్టి సామ్యవాద నిర్మాణం చేయలేదు. కాని మీరు మాత్రం పుస్తకాలు జూచి సామ్యవాదులైనారు. శంకరాచార్యులు యేవిధముగా భావప్రచారము గావించినారో అట్లే మనము కూడ చేయవలసియున్నది. నా సభలలో వేలకొలది ప్రజ పాల్గొనుచున్నారు. వారువచ్చి విని యింటికి వెళ్ళిన మీదట గాలి, వెలుగు, నీరువలె భూమికూడ దైవమిచ్చినదేనని చెప్పుకొంటున్నారు. కమ్యూనిష్టులు మాత్రం యింతకంటె కోరునదేమున్నది? ఒకవేళ వారు ఆభగవంతుని పేరునే వ్యతిరేకిస్తుంటే అది తలవకుండావుండటం నావల్లకాదు; క్షమించండని మాత్రం చెప్పుకుంటాను.

ప్ర॥ తమరు తమ యీకార్యంలో యేయేసంస్థల సహాయమును పొందగలరు? లేక యేదైనా క్రొత్తసంస్థ నొకదానిని

యేర్పాటు జేసుకొంటారా? తమ అనంతరం తమ భావప్రచారం యేవిధంగా జరుగుతుంది? అందుకుగాను మీరు మీ వెనుక యేదైనా వ్యవస్థను యేర్పాటుజేసి వెళ్లగలరా?

జ॥ దానికొరకు నేను యే క్రొత్తసంస్థను నిర్మాణం చేయను. నాపని అన్నిసంస్థలు చేయగలవు. చేస్తున్నవికూడా. భూమిని అందరూ సేకరించగలరు. అందరిసహకారము మాకు లభించినది. యేసంస్థయైనా కావలెననుకుంటే స్వతంత్రముగా కూడ యీపని చేయవచ్చును. లేక యితర సంస్థలతో కలసి పనిచేయవచ్చును.

వితరణ (పంపకం) కమిటీలు మేము యేర్పాటు జేస్తున్న మాట యదార్థనే. పంపక కార్యక్రమముకూడ మాఆదేశం ప్రకారనే జరుగుచున్నది. ఉత్తరప్రదేశ్ లో సేకరణ పూర్తి యైనపిమ్మట వితరణకమిటీలు యేర్పాటు జేసినాము. ఇట్లే ఆయా ప్రాంతాలలో భూమిసేకరణలో అనుభవము పొందిన మీదట కమిటీలు యేర్పాటు జేయబడగలవు.

నేను భూమిని నావెనుకనే వదలివెళ్లగలను. అది యే పద్ధతిలో లభించిందో ఆపద్ధతికి చిహ్నంగా నిలచిపోతుంది. ఈ విధముగా నావెనుక నాభావప్రచారానికి ఆ భూమికూడ ప్రాతినిధ్యం వహిస్తుంది. నదులు సముద్రములో కలిసి సముద్రరూపము ధరిస్తున్నవి. కట్టెపుల్ల నిప్పుతో కలిసి నిప్పుగా మారిపోతున్నది. నాపనిలో పాల్గొంటున్నవారంతా ఆపనితోపాటు ఆరూపమునే పొందగలరు. నాభావాలన్నుప్రచారంచేయుగలరు.

ఒక సోదరుడు (కార్యకర్త) పరుషభాష ఉపయోగిస్తున్నాడని యిప్పుడే వార్ధానుండి ఉత్తరము వచ్చింది. నేనే అతనిని అలా మాట్లాడవద్దని హెచ్చరిస్తూ ప్రత్యుత్తరం వ్రాశాను. యిప్పటినుంచి వారిని యేమీ దూషించవద్దని అందరికి చెప్పుచునేయున్నాము. కారణమేమన నేడు యున్నవారు రేపు తప్పక యుండవచ్చును. మేము పెద్దపెద్ద ధనస్వాముల వద్దకు వెళ్లలేమని సోషలిస్టులు చెప్పగా పోనీ గ్రామం గ్రామమంతా తిరిగి చిన్నవారినే కలుసుకొండని వారికి తెలియచెప్పితిని. ఏదిచేయగలవో అదే చెయ్యి. పెద్దవారిని యితరులకు వదలి పెట్టు. భీష్మునితో యుద్ధము చేయవలెనంటే అర్జునుడే అవసరము కాగలడు.



బహ్వేదయాః ముద్రాక్షరశాలయందు ఎక్కటి బాలగంగాధరతిలక్ చే ముద్రితం